విజయ మాధవి పిక్చర్స్

# ఆత్మీయుడు

ఈస్ట్‌మన్ కలర్

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: తాతినేని రామారావు

నిర్మాత: వడ్డే శోభనాద్రి నిర్వహణ: వడ్డే రమేష్



తప్పక చూడండి

శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైసెస్

# ఆమె కథ




పశ్చిమ, తూర్పుగోదావరి జిల్లాలు: సర్వారాయుడు మల్లికార్జున ఫిలింస్ (రాజమండ్రి) శ్రీనివాసా ఫిలింస్ ద్వారా విడుదల

వైజాగ్, శ్రీకాకుళం: శ్రీపద్మా పిక్చర్స్ (వైజాగ్) చిత్తూరు: విజయనిర్మల పిక్చర్స్ సీడెడ్: జయలక్ష్మీ పిక్చర్స్, నైజాం: శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్

20–1–'78 సంచిక సంక్రాంతి సంచికగా వెలువడుతుంది. రచయితలు చిత్రకారులు డిసెంబర్ నెల 20 లోగా పరిశీలనకి రచనలు పంపవచ్చును. సం.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]
శుక్రవారం : 2-12-'77
పింగళనామ సం. కార్తీక బ. షష్ఠి
*సంపుటము 71 సంచిక 11*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ 520 003

## విషయానుక్రమణిక

## ముఖచిత్రం

11.11.77 జయసుధగారి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక నన్నాకట్టుకుంది. ఈ సారి ఇంత మంచి ముఖచిత్రం వేయడానికి మీరు తీసుకున్న కృషికి నా కృతజ్ఞతలు. ఇక ముందు కూడా ఇలాంటి ముఖచిత్రాలే వేస్తారని ఆశిస్తాను. ఇక పోతే తిక్క కుదిరింది కథ చాలాబాగుంది. అందులో కమల పాత్ర నాకెంతో నచ్చింది. రచయిత్రికి నా అభినందనలు.

షేక్ అమీర్‌భాషా. [అల్లూరు]

## సీరియల్

జయసుధ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఎన్నుల పండుగగా ఉంది. 'జీవన పోరాటంలో ఆశల ఆరాటం' సీరియల్ ఇంటరెస్టింగ్‌గానే నడుస్తూ ఉంది. తిక్క కుదిరింది కథలో బండారు లక్ష్మిగారు చక్కని నిజాన్ని తెలియజేశారు. ఆంధ్రపత్రికలో జి. వి. జి. పేజీ అత్యంత ఆకర్షణీయం అనడం శ్రేయస్కరం.

జి. విజయాసుందరం, [బొంబాయి]

## కథలు

శ్రీ బండారు లక్ష్మిగారు రచించిన తిక్కకుదిరింది కథ చాలా బాగున్నది రాగబంధం, జీవన పోరాటంలో ఆశల ఆరాటం సీరియల్స్ చాలా ఆసక్తిగా సాగుతున్నవి.

ఆర్. హరిప్రియాదేవి. [బరంపురం]

## పర్సనల్ నోట్‌బుక్ కాదుగదా!

హైదరాబాద్ నోట్‌బుక్కు నిజంగా అది తి. రా. గారి పర్సనల్ నోట్‌బుక్ కాదుకదా ఆ పేజీ రాజధానిలో జరిగే అతి ముఖ్య వార్తల్ని పాఠకులకి అందచేయడానికే వుద్దేశించబడిందనుకుంటాను. అంతేగాని వ్యాస రచయితగారి వ్యక్తిగత డాక్టరేట్ స్నేహితుల జన్మదిన శుభాకాంక్షలు అందచెయ్యడానికి, వారి కులం

## ఉత్తరాలు

గురించి ఎక్కడలేని ఉపమానాలు వర్ణించడానికి [ఈ రోజుల్లో కులాన్ని విస్మరించమని నానా సంస్థలు, ప్రభుత్వం ఘోషెత్తి పోసేస్తుంటే] పత్రికలోని విలువైన స్థలాన్ని హరించేయడం

*ఉజ్వల తార !*



తెలుగు చలనచిత్ర పరిశ్రమలో ఉత్తమాభిరుచికి మారుపేరుగా వాసికెక్కి — అఖిల భారతస్థాయి ఖ్యాతి ఘనత పొందిన శ్రీ బి. యన్. రెడ్డిగారు నవంబర్ 8న మద్రాసులో కీర్తిశేషులు అవడంతో తెలుగు చిత్రసీమలో ఒక ఉజ్వల తార రాలిపోయినట్లే అయినది.

పాఠకుల పట్ల జరిగిన అన్యాయమని భావిస్తున్నాను [9—9—77]

ప్రతిభాశాలురైన శ్రీ బాలరాజ గురించి ఫ్లాష్ చెయ్యదలచుకుంటే వేరే వ్యాసం రాసి ప్రచురించడంలో అభ్యంతరం లేదు. గాని ఒక ప్రత్యేక కాలమునుండి ఆశించే ప్రత్యేక న్యూస్ భరద్వాజ పొగడ్తలు వినిపిస్తే నిరాశ, ఆవేదన తప్పకుండా పుట్టుకొస్తాయి

పిష్పల కామేశ్వరరావు [ఆద్రా, ప.బెంగాల్]

## శ్రీ తి. రా. గారి జవాబు

జంటనగరాలలోని విశేషాలతోబాటు జంటనగరాల సంస్థలను, జంటనగరాలలోని, నగరాలకు వచ్చిన ప్రతిభావంతులను పరిచయం చేయడం గూడ హైదరాబాద్ నోట్‌బుక్ ఉద్దేశం. ఐదేళ్లుగా ఇది సాగుతున్నది రాజకీయ నాయకులు ఫలానా చీరకట్టుకున్నారు, ఫలానా షేవింగ్ బ్లేడ్ వేసుకొన్నారు అని వ్రాయడంకన్న, ప్రతిభావంతులను, సాంస్కృతిక రంగంలో అజ్ఞాతంగా సేవచేస్తున్న వారిని ఆత్మీయతతో ప్రశంసించడం తప్పుకాదనుకుంటాను లోపాలు అందరిలోనూ వుంటాయి. వాటిని, వదలి, తెలుసుకోదగిన మంచిని మాత్రం తెలుపడమే నా లక్ష్యం. వ్రాసే వాడిని నేను గనుక నా భావాలు నా వ్రాతలలో తొంగిచూడక తప్పదుకదా! యథార్థ కథనానికి, భరద్వాజ పొగడ్తలకు శ్రీ కామేశ్వరరావుగారు భేదం గ్రహించాలని మనవి. నేను బాలరాజ యోగ్యతలో పదోవంతు చెప్పాను. కామేశ్వరరావుగారు శ్రీ బాలరాజ గ్రంథాలను పరిశీలించి, ఆయనతో పరిచయం చేసుకొంటే, నాకన్నా హెచ్చుగా పొగుడుతారని నా విశ్వాసం. గుణాః పూజాస్థానం, గుణిషు న చ లింగం, న చ కులం.

తిరుమల రామచంద్ర [హైదరాబాదు] ●

# ధర్మపథం

## దైవప్రార్థన

దేవాలయాలకు పోయి, భగవత్పూజలు సందర్శించి, ప్రసాదం స్వీకరించి, ఇంటికి వచ్చే ముందు దేవాలయంలో కొంచంసేపు కూర్చుని మరీ రావడం మన సంప్రదాయం. అలా కూర్చోవడంలో అర్థం లేకపోలేదు. ఆవిధంగా కూర్చున్నంతసేపూ నిర్మలమైన మనస్సుతో భగవంతుని ధ్యానం చెయ్యాలని మనవారి అభిప్రాయం. అంతేకాని విశ్రాంతి కోసంకాని, పిచ్చాపాటిమాట్లాడుకోడానికి కానికాదు. ఆ విధంగానే నియమిత కాలంలో అందరూ చేరి సమిష్టిప్రార్థన చెయ్యడం కూడామనస్సు ప్రశాంతంగ ఉండడంకోసమే!

గుడిలోకి వెళ్లి ప్రార్థన చెయ్యడానికి కాని సమిష్టిప్రార్థనకు గాని అందరికీ అవకాశం ఉండదు. పగలల్లా పనులకు పోయేవారికి వారి వారి పనులతోనూ, ఇంట్లో ఉన్నవారికి గృహ కృత్యాలతోనూ గడిచిపోతుంది. కొంతిసేపటి తీరుబడి ఉన్నా, తర్వాత చెయ్యవలసినదేమి? అనే ఆలోచనలోనే మనస్సు కొట్టుమిట్టాడుతూ ఉంటుంది. అంచేత అప్పుడు కూడా ప్రార్థనకు అవకాశం ఉండదు.

రాత్రి పరున్నప్పుడూ, ఉదయాన్ని లేచేటప్పుడూ దైవప్రార్థనకు కొంత వీలు ఉంటుంది. పడుకునేటప్పుడు "దేవా! నాకు తెలిసో,తెలియకనో పగటి పూట ఎన్నోతప్పులు చేసి ఉంటాను. వింతో పాపం గడించి ఉంటాను నాతప్పులను క్షమించి నన్ను రక్షించు. అట్టి తప్పులు మరి చెయ్యకుండా ఉండే బుద్ధిని అనుగ్రహించు" అని ప్రార్థించవలసి ఉంటుంది. ఆవిధంగానే నిద్రలేచేటప్పుడు "దేవా! ఇకమీద నేను నా దైనిక జీవితాన్ని ప్రారంభిస్తాను. నేను నా విహిత కృత్యాలను సక్రమంగా నెరవేర్చేటట్లూ, నా బుద్ధి కుమార్గంలో ప్రవేశించకుండా ఉండేటట్లుచూడు. నావల్ల ఎవరికీ ఎట్టి అపకారం కలగకుండా ఉండాలని నాసంకల్పం అణ్వే వీలయినంత ఉపకారం చెయ్యాలని కోరిక. నా సంకల్పాలు నెరవేర్చి నా జన్మ చరితార్థం చెయ్యి" అని ప్రార్థించాలి.

ఈ సమయాల్లో చేసిన ప్రార్థన వల్లనే ప్రయోజనం ఉంటుంది.

—బులుసు వేంకటరమణయ్య

---

# వారఫలం

మహేష్

**2-12-1977** శుక్రవారంమొదలు
**8-12-1977** గురువారం వరకు

**మేషం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ఇతరుల నిమిత్తం శ్రమపొందవలసి వస్తుంది. స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం:—** వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటాము.

**కర్కాటకం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మీ మంచి తనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:—** చికాకులు ఏర్పడతాయి మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో అనుకూలత లభించగలదు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లభిస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన సమాచారం అందగలదు.

**తుల:—** రావలసిన డబ్బు అందుతుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో శ్రమకలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగిబాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:—** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**ధనుస్సు:—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మకరం:—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**కుంభం:—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. ఆందోళన కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుషులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

నవరక్తిని. నవశక్తిని కలిగించే

నెస్‌కాఫే కమ్మని రుచితో
నూతనోత్సాహాన్ని
పొందండి.

# నెస్‌కాఫే®




నూటికి నూరుపాళ్లు స్వచ్ఛ
మైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ



ప్రపంచంలోకెల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

NSC-177-TEL

# ఈ గాలిలో దెయ్యాలున్నాయి

## దమయంతి



నేర పరిశోధక కథా రచయిత చిరంజీవి తలుపు తెరిచాడు. ఆ వ్యక్తి లోపలికి ప్రవేశిస్తూ, "నా పేరు శ్రావణకుమార్" అన్నాడు.

''రండి'' లోపలికి దారితీస్తూ అన్నాడు చిరంజీవి,

''మీ ప్రకటన చూశాను'' అన్నాడతను కుర్చీలో కూర్చోబోతూ.

''ఊఁ''

''మీరు చెప్పబోయే కథ వినాలని చాలా ఆసక్తిగా ఉంది.''

''ఒక్క ఆసక్తి ఉంటే చాలదు'' సిగరెట్ ముట్టిస్తూ అన్నాడు చిరంజీవి.

''అందుక్కావలసిన గుండె ధైర్యమూ ఉంది. విని తట్టుకోగలనన్న నమ్మకమూ నాకుంది'' అన్నాడతను.

తలతిప్పి అతని ముఖంలోకి చూసాడు చిరంజీవి. తను చెప్పబోయేది వినడానికి సిద్ధంగా ఉన్నట్టు కుర్చీలో ముందుకు వంగి కూర్చుని ఉన్నాడతను.

''మీ ప్రకటన వింతగా ఉంది. ఇటువంటి ప్రకటన చూడటం ఇదే మొదటిసారి. మీరు చెప్పబోయే కథ విని తీరాలనే వచ్చాను. అసలు ఈ రకం ప్రకటన చెయ్యటంలో మీ ఉద్దేశ్యం?'' అడిగాడతను.

చిరంజీవి కుర్చీలో కదిలాడు. సిగరెట్ యాష్ ట్రేలో దులుపుతూ అన్నాడు.

''ఉద్దేశమంటూ ప్రత్యేకించి ఏమీలేదు. నా జీవితంలో జరిగింది ఇంకెవరికన్నా జరిగితే ఎంతమంది భరించి ఎదుర్కోగలరో తెలుసుకుందామని. అంతే.''

''అంత భరించలేని విషయంగా మీరనుకొంటున్నారా?''

''అవును'' అంటూ సూటిగా అతని ముఖంలోకి చూసాడు చిరంజీవి.

''ఎందుకంటే నేను చెప్పబోయేది మామూలు సినిమా కథ కాదు. ఎక్కడో ఏదో జరిగితే ఊహించి కల్పించి రాసినది అంతకంటే కాదు. నేను చెప్పబోయేది స్వయంగా నా అనుభవంలోది. ఇదే మరొకడి విషయంలో జరిగి వుంటే గ్యారంటీగా తక్షణ చచ్చివుండేవాడు. లేదా ఆత్మహత్య చేసుకునైనా ఉండేవాడు. కాని నేను బ్రతికున్నాను. అందుకే నాలా ఎంతమంది బ్రతికి ఉండగలరో తెలుసుకుందామనిపించింది.''

''చెప్పండి'' అన్నాడతను వినడానికి సిద్ధమౌతూ.

''మీరు నిజంగా నేను చెప్పబోయేది వినదల్చుకున్నారా?''

నవ్వాడు శ్రావణ కుమార్.

''అందుకేగదా వచ్చింది. మీరు ఏం చెప్పినా వినడానికి సిద్ధమే.

''అయితే సరే.'' కుర్చీలోంచి లేచాడు చిరంజీవి. ''ఇక్కడ కాదు లోపల కూర్చుందాం.''

మరో గదిలోకి దారి తీసాడు చిరంజీవి. శ్రావణకుమార్ అనుసరించాడు.

ఆ గదిలో అందమైన కార్పెట్ పరిచి ఉంది. కార్పెట్‌కి చుట్టూ నాలుగు ప్రక్కలా సోఫాలున్నాయి. మధ్యలో టీపాయ్ మీద చక్కని గ్లాస్‌తో చేసిన యాష్ ట్రే ఉంది. ఒక పక్కగా రాక్‌లో ఏవేవో ఇంగ్లీషు, తెలుగు పుస్తకాలు, మరోపక్క టేబులూ. దాని ముందొక రోజ్‌ఉడ్ కుర్చీ ఉన్నాయి, గది చాలా నీట్‌గా ఉంది.

కిటికీ కర్టెన్ తొలగించాడు చిరంజీవి.

''కూర్చోండి'' అన్నాడు తనూ ఒక సోఫాలో కూర్చుంటూ.

కిటికీలోంచి చూస్తే ఆ ఇంటికి కాస్త దూరంగా రైలుపట్టాలూ, వాటి కానుకొని హుస్సేన్ సాగర్ చెరువు, దూరంగా టాంక్ బండ్ మీద వరుసగా పరుగెత్తే వాహనాలూ కనబడుతున్నై.

''మొదలు పెడతారా ?'' అడిగాడు శ్రావణకుమార్.

''ఒక్కనిముషం. డిక్లరేషన్‌తెచ్చారా?''

''ఓ సారీ. కథ వినాలన్న కుతూహలంలో ఆ విషయం మర్చిపోయాను. మీకు అభ్యంతరం లేకపోతే ఇప్పుడే రాసిస్తాను.''

తెల్లకాగితం, పెన్నూ, అందించాడు చిరంజీవి.

కాగితానికి మధ్యగా ఒక పేరాలో రాసి చిరంజీవి చేతికిచ్చాడు.

చిరంజీవి ఆ కాగితాన్ని అందుకుని చూసాడు.

'నేను నా పరిపూర్ణాంగీకారంతో చిరంజీవిగారు చెప్పబోయే కథని వినడానికి ఇష్టపడుతున్నాను. ఇందు మూలంగా, ఆ తర్వాత జరిగే పరిణామాలకిగానీ, మహా వైకల్యానికి గానీ, లేదా మరణానికి గానీ ఎవరూ ఎటువంటి బాధ్యులూ కారు. ఇది నా స్వాంగీకారంతో చేస్తున్నపని — శ్రావణ కుమార్.'

"రైట్"

కాగితాన్ని మడిచి డ్రాయర్‌లో పెట్టివచ్చి సోఫాలో కూర్చున్నాడు చిరంజీవి.

"అయామ్ రెడీ" అన్నాడు శ్రావణ కుమార్.

శ్రావణకుమార్ ఆసక్తిగా వింటున్నాడు.

కథ చెబుతూ అప్పుడప్పుడూ తల తిప్పి శ్రావణకుమార్ ముఖంలోకి చూస్తున్నాడు చిరంజీవి.

శ్రావణకుమార్ ముఖంలో రంగులు మారడం గమనించాడు చిరంజీవి.

చెప్పడం ఆపాడు.

"కారీ ఆన్" అన్నాడు శ్రావణకుమార్.

చిరంజీవి తిరిగి మొదలు పెట్టాడు. దాదాపు పూర్తికావచ్చింది. కిటికీలోంచి బయటికి చూస్తూ చెబుతున్నవాడల్లా ఆగి ఒక్కసారి శ్రావణకుమార్ వంక చూసాడు.

అతను సోఫాలో వెనక్కి ఆనుకుని ఉన్నాడు. కాళ్ళు దూరంగా జార్చి నిద్రావస్థలో ఉన్నట్టుగా ఉన్నాడు.

"ఆపనా ?" అడిగాడు చిరంజీవి.

"నో. నో" కంటిన్యూ చెయ్యమన్నట్టుగా సైగచేసాడు తను.

చిరంజీవి కథ చెప్పడం పూర్తిచేసి ఇటు తిరిగాడు. శ్రావణకుమార్ కళ్ళు మూతలు పడ్డాయి. ముఖమంతా చెమట దట్టంగా పట్టింది. లేచి దగ్గరగా వచ్చి కుదిపి చూసాడు చిరంజీవి.

శ్రావణకుమార్ స్పృహలో లేడు !

* * *

పదిరోజుల తర్వాత వచ్చిన మధుమూర్తీ, ఆ తర్వాత వాసుదేవరావూ అటు తర్వాత రత్నప్రసాదూ అంతా శ్రావణకుమార్ మార్గాన్నే ఎన్నుకున్నారు..

చిరంజీవి ఇంటి కాలింగ్‌బెల్ మ్రోగింది.

"కమిన్" అన్నాడు.

తలుపు తోసుకుని లోపలికి వచ్చిన అమ్మాయిని చూసాడు చిరంజీవి. వయసు ఇరవైకి పైగా ఉండొచ్చు. చూసినవెంటనే ఆమెలో అందంకన్నా ఆకర్షణ పాలెక్కువని గ్రహించాడు చిరంజీవి.

"చిరంజీవిగారు మీరే అనుకుంటాను.."

ఆమె చుట్టూ పరికించి చూస్తూ అడిగింది.

"నేనే. రండి" అన్నాడు.

ఆమె బాగ్ ఓపెన్‌చేసి చిన్న పేపర్ కటింగ్ బయటికి తీసింది.

ప్రకటన : నేను చెప్పే ఒక కథని పూర్తిగా వినేవాళ్ళు కావాలి. కథ పూర్తిగా విన్నవాళ్లకి ఆ తర్వాత వెంటనే పదివేల రూపాయల నగదు బహుమానం ఇవ్వబడుతుంది. అయితే ఇందుకు గుండెధైర్యం, ఆత్మ నిబ్బరం అవసరం. షరతులని అంగీకరించే పక్షంలో ఈ క్రింది అడ్రసుని సంప్రదించగలరు.' కుడిపక్క కిందగా అడ్రసు ఉంది.

పేపర్ కటింగ్ చేతిలోకి తీసుకుని చూసి అందామ్మాయి.

"ఈ ప్రకటన ..."

చిరంజీవి అందుకున్నాడు.

"అవును. నేనే చేసాను. మీరు కథ వినడానికి వచ్చారా ?"

"అవును. ఏం ?" అతని కంఠంలో ఏదో మార్పుని గమనించి అడిగింది.

లేతగా సుకుమారంగా కనిపించే ఆ పిల్ల తను చెప్పబోయే కథ విని తట్టుకోగలదా అని ఆలోచిస్తున్నాడు చిరంజీవి.

"ఏదో ఆలోచిస్తున్నారు. ఆడవాళ్లకి చెప్పడానికి అభ్యంతరమా ?" అడిగిందా మ్మాయి సన్నగా నవ్వుతూ.

"అదేంకాదు. మీ పేరు ?"

"సమీర" అన్నదామె.

బాగుంది. చాలా రేర్‌నేమ్. కాని కథ చెప్పబోయేముందు ఒక్కమాట. ఆ కథ విని భరించగల శక్తి మీకు ఉండాలి. అందుకు చాలా మనోబలం కావాలి. ఇంతకు ముందు నేను చెప్పే కథ విని చాలామంది పారిపోయారు. ఓ మనిషి గుండె పగిలి చచ్చిపోయాడు కూడాను" అన్నాడు.

"చచ్చిపోయాడా ?" ఆశ్చర్యంగా అడిగింది సమీర.

"అంత భయంకరమైనదా ఆ కథ ?"

"అవునో కాదో నేను చెప్పలేను. కానీ అదిమాత్రం నా జీవితంలో జరిగింది.

"ఫరవాలేదు. ఆ కథ విన్నతర్వాత నేను బతికి ఉండగలనన్న విశ్వాసం కూడా నాకుంది. కథ వింటాను. విని మీరిచ్చే పదివేల రూపాయలూ గెలుచుకునే వెళ్తాను."

"తొందర పడకండి. మీ జీవితాన్ని చేతులారా పోగొట్టుకుంటారేమో. ఆలోచించండి. ఇంటికివెళ్లి తిరిగ్గా ఆలోచించుకుని తట్టుకోగలననుకొంటే రేపు రండి చెబుతాను."

చూస్తూ చూస్తూ ఆ అమ్మాయి బలిచెయ్యడం ఇష్టంలేక పోయిందిని చిరంజీవికి.

ఆమె చిన్నగా నవ్వి.

"కథ చెప్పడానికి మీరెందుకింత వెనకాడుతున్నారో నా కర్థంకావడంలేదు. నా జీవితం

అహమ్మదాబాద్‌లో అక్టోబరు ఆఖరి వారంలో జరిగిన జాతీయ ఈతపోటీలలో మనవాళ్ళు కొన్నికొత్త జాతీయ రికార్డులను నెలకొల్పారు.

మహారాష్ట్రకు చెందిన మహిళ స్మితాదేశాయ్ మూడు కొత్త జాతీయ రికార్డులను నెలకొల్పారు. అవి యివి :

(1) 200 మీటర్ల దూరాన్ని ఫ్రీస్టయిల్ పోటీలో 2 నిముషాల 33.2 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(2) 400 మీటర్ల దూరాన్ని ఫ్రీస్టయిల్ పోటీలో 5 నిమిషాల 27.3 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(3) 100 మీటర్ల బటర్‌ఫ్లై పోటీలో 1 నిమిషము 16.3 సెకన్లలో ఈది ఆమె కొత్త రికార్డు స్థాపించారు.

ఇవికాక ఈ క్రింది కొత్త జాతీయ రికార్డులు కూడా నెలకొల్పబడ్డాయి.

## మీకు తెలుసా ?!

(1) అనిల్‌గంజా (రాజస్థాన్) పురుషుల 400 మీటర్ల ఫ్రీస్టయిల్ పోటీలో 4 నిమిషాల39.7 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(2). నేతాయ్ పుర్కాయిత్ (రైల్వే) పురుషుల 100 మీటర్ల బటర్‌ఫ్లై పోటీలో 1 నిమిషము 3.6 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(3) యాన్‌చిన్‌షిన్ (రైల్వే) పురుషుల 200 మీటర్ల బటర్‌ఫ్లై పోటీలో 2 నిమిషాల 28 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(4) మృదులాశాస్త్రి (మహారాష్ట్ర) మహిళల 200 మీటర్ల బ్రెస్ట్ స్ట్రోక్ పోటీలో 3 నిమిషాల 16.6 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(5) మొహిందర్‌సింగ్ రాణా (ఢిల్లీ) పురుషుల 200 మీటర్ల ఫ్రీస్టయిల్ పోటీలో 2 నిమిషాల 10 సెకన్లలో ఈది కొత్తరికార్డు స్థాపించారు.

(6) జి. యస్. నాయర్, వి. సి. జాన్, ప్రభాకరన్,సి. పి. కుంజు(సర్వీసెస్)పురుషుల 4 × 100 మీటర్ల ఫ్రీస్టయిల్ రిలే పోటీలో 3 నిమిషాల 56.8 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(7) అసిన్‌దాస్, ఎం. హాల్దా, పుర్కాయిత్, ఎస్. సహ (రైల్వేస్) పురుషుల 4 × 100 మీటర్ల మెడ్లే రిలే పోటీలో 4 నిమిషాల 32.6 సెకన్లలో ఈది కొత్త రికార్డు స్థాపించారు.

(8) స్మితాదేశాయ్, మృదులాశాస్త్రి, సెఫలీబక్షి, షర్మిలాబక్షి (మహారాష్ట్ర) మహిళల 4 × 100 మీటర్ల ఫ్రీస్టయిల్ రిలే పోటీలో 4 నిమిషాల56.4 సెకన్లలో ఈది కొత్తరికార్డు స్థాపించారు.

(సేకరణ : జాస్తి దినకర ప్రసాదరావు).

---

ఇంతకంటె నాశనం ఏం కాదు. ఒకవేళ నేను చచ్చిపోయినా ఒక ప్రఖ్యాత క్రైం రచయిత చేతిలో ఓడిపోయానన్న తృప్తి మిగులుతుంది. చచ్చిపోవడానికి నేను భయపడను'' అంది.

ఆమె మాటలకి ఆశ్చర్యపోయాడు చిరంజీవి

''మీరేదో నిరాశగా మాట్లాడుతున్నట్లున్నారు. ఇంత చిన్న వయసులో ఎందుకంత వైరాగ్యం ? మీ ప్రాణం విలువ పదివేలా?'' అన్నాడు.

''కాదు. ఎవరెవరు ఏంతెంత అనుకుని నాకిచ్చి నన్ను వాడుకుని వెళ్ళారో అంత. నా ఖరీదు నాకే తెలీదు.''

''అంటే ?''

'ఏంలేదు. చెడిపోయిన మనిషికి విలువ చెప్పమంటే ఎవరు చెప్పగలరు ? మీరిచ్చే పదివేలు పెట్టి స్టెప్నను కొనుక్కొని ఎగిరిపోవాలని నా ప్రయత్నం. అంతే.''

కథ చెప్పి ఆమెని చంపడమా లేక చెప్పకుండా బ్రతికించి చంపేడమాఅన్న సందిగ్ధావస్థలో పడ్డాడు చిరంజీవి.

''ఏమిటి ఆలోచిస్తున్నారు ? కథ చెప్పడమా మానెయ్యడమా అనా ?'' అతని ఆలోచనలు పసిగట్టింది వనిత.

''మీరు గట్టిగా వినితీరాలంటే చెబుతాను. నాకేం అభ్యంతరం లేదు.'' అన్నాడు.

''అయితే మొదలు పెట్టండి'' అంది.

చిరంజీవి ఆమెచేత డిక్టేషన్ రాయించుకున్నాడు.

## ఈగాలిలో దెయ్యాలున్నాయి

కిటికీలోంచి బయటకు చూస్తూ చెప్పడం మొదలు పెట్టాడు. సగం వరకు చాలా నిబ్బరంగా ఆసక్తిగా వింది. కథ పూర్తి అవుతుండగా చావు కేక పెట్టి సోఫాలో ఒక పక్కకి వాలిపోయింది.

చిరంజీవి కంగారుగా లేచాడు. ఆమె నిలువునా వణికిపోతోంది. ఒళ్ళంతా చెమట పట్టింది. ఊపిరి ఆడనట్టుగా కొట్టుకుంటోంది. గ్లాసులో నీళ్ళు ఆమె ముఖాన చిలకరించి గ్లాసు నోటికందించాడు. ఆమె బలవంతంగా రెండు గుటకలు వేసింది.

''నేను ముందే చెబితే విన్లేదు ...'' చిరంజీవి బాధగా అన్నాడు.

ఆమె శుష్క మందహాసం చేసింది. ఏదో మాట్లాడబోయి నోరు విప్పి మాట రాక అలాగే చూస్తూ ఉండిపోయింది. ఆ తర్వాత కాస్సేపటికే ఆమె మెడ వాల్చేసింది!

అలా పడిఉన్న ఆమెని చూస్తుంటే చిరంజీవి మనసుఎలాగోఅయింది. చేత్తోఆమె ముఖం, చేతులు నిమిరాడు, వంగి మూతలు పడిన ఆమె కళ్ళమైన సున్నితంగా ముద్దు పెట్టుకొని ఆ గదిలోంచి బయటికి నడిచాడు.

* * *

అది జరిగిన వారం రోజుల తర్వాత ఒక రోజు చిరంజీవి తన గదిలో టేబుల్‌ముందు కూర్చుని రాసుకొంటున్నాడు. అప్పటికిరాత్రి తొమ్మిది గంటలు కావస్తోంది. తలుపు చప్పుడైంది. లేచివెళ్ళి తలుపు తీశాడు. అతన్ని తోసుకుంటూ ఒక వ్యక్తి లోపలికి ప్రవేశించాడు. మనిషి మంచి వయసులో ఉన్నాడు. వయసు ముప్పై అయిదు ఉండొచ్చు. లోపలికి వచ్చి

''మిస్టర్ చిరంజీవీ, గ్లాడ్ టు సీయూ'' అన్నాడు. ఆటు తర్వాత చెయ్యి ముందుకి చాచి కరచాలనం చేసాడు.

''ఐ యామ్ శాంతి భూషణ్'' అన్నాడతను కలుపుగోరుతనంగా.

''ప్లీజ్ బి సీటెడ్''

''థ్యాంక్యూ.'' వచ్చినపని చెప్పాడతను.

''మీ కథ వినాలని చాలా ఆసక్తి ఉంది'' అన్నాడు.

''మిస్టర్ శాంతిభూషణ్...''

ఏమిటన్నట్లుగా చూసాడా వ్యక్తి.

''మీరు చూపిస్తున్న ఉత్సాహానికి చాల సంతోషంగా ఉంది. కాని నిజం చెప్పడం నా ధర్మం. ఇంతకు ముందు నేను చెప్పిన కథ విన్నవాళ్ళు భయపడి జీవితాలనుంచి పారిపోయారు. ఎదుర్కోవలసిన పరిస్థితిని ముందే చెబుతున్నాను. ఆ తర్వాత మీ ఇష్టం.''

శాంతి భూషణ్ తమాషాగా నవ్వాడు;

''మీరు వింతగా మాట్లాడుతున్నారు. రమ్మని పిలిచి పిరికిమందు పొయ్యడం ఏమీ బాగోలేదు. మీరు కథ చెప్పండి. ఆ తర్వాత ఏం జరుగుతుందో మీ కళ్ళతో స్వయంగా చూద్దురుగాని. మీరూహించినట్లుగా నేనేమీ

అయిపోను. హాయిగా కథవిని దాన్ని తలచు కొని నవ్వుకొంటూ చక్కగా ఇంటికి వెళ తాను. అఫ్‌కోర్స్ మీ దగ్గర్నుంచి పదివేలూ వసూలు చేసే అనుకోండి.''

''అయితే కథ వింటానంటారు'' అడి గాడు చిరంజీవి

''తప్పకుండా. మీకింకా సందేహమైతే ఒక సంగతి చెబుతాను.''

''ఏమిటి ?''

''నేను మొదటినుంచీ చాలా ధైర్య స్తుడ్నే. ఇలాంటి ఛాలెంజీల నెదుర్కొవి సాహసం చెయ్యడం అంటే నా కిష్టం. ఎడ్వంచర్ లేని లైఫేం లైఫ్ చెప్పండి? ఒకసారిలాగే ఏం జరిగిందంటే-అప్పుడు నేను ఒంటరిగా ఉండేవాడిని. తిరిగి తిరిగి ఎప్పుడో రాత్రి పదింటికి ఇంటికి చేరడం అలవాటు. నాకు ఓ అమ్మాయితో స్నేహం అయ్యింది. ఎప్పుడు ఎలా జరిగిందో సరిగా గుర్తులేదు కాని ఆమెతో గడిపిన ప్రతి క్షణం నాకిప్పటికీ బాగా జ్ఞాపకం. నా కెప్పుడు ఇంటికి తిరిగి వస్తుండగా రాత్రుళ్లే కనిపించేది. ఆమెతో నేను గడిపిన క్షణాలు చాలా మధురమైనవి. నేనెప్పటికీ మరిచిపోలేనివి.''

శాంతిభూషణ్ ఒక్కక్షణం ఆగాడు.

''హఠాత్తుగా ఆమె కనిపించడం మానేసింది. నేను దాదాపు పిచ్చివాణ్ణి

## ఈగాలిలో దెయ్యాలున్నాయి

య్యాను. ఆ తర్వాత నా స్నేహితులు చెప్పారు. నేను చెప్పిన ఆమె మనిషి కాదని ఎప్పుడో చనిపోయిందని ఆ అమ్మాయి ఆ ఇంటిగల వాళ్ళ పిల్లనీను. ఆమె మనిషి కాదు. నా కిప్పటికీ అనిపిస్తుంది తాను స్వయంగా అనుభవించిన స్త్రీ మనిషికాదూ, దెయ్యం అని తెలిస్తే కనీసం తర్వాత ఆమె తోటి అనుభవాన్ని ఊహించుకునైనా మరొకడెవడైనా అయితే గుండె ఆగి చచ్చి ఉండేవాడు. కాని నేను ఈ రోజుకీ ఆమె జ్ఞాపకాల్ని నెమరేసుకొంటూ ఉంటాను."

అతను చెప్పడం ముగించి చిరంజీవి ముఖంలోకి చూసాడు.

"ఓ. కె. కథ చెబుతాను."

చిరంజీవి లేచివెళ్లి సిగరెట్ ప్యాకెట్ తెచ్చుకుని అతనికి ఆఫర్ చేసాడు.

"థాంక్స్. నాకు సిగరెట్ అలవాటు లేదు. దయచేసి మీరూ కాల్చకండి. నాకు ఆ వాసనే గిట్టదు" అన్నాడు శాంతి భూషణ్

ఫార్మాలిటీస్ పూర్తిచేసి చిరంజీవి కథ చెప్పడం మొదలుపెట్టాడు.

శాంతిభూషణ్ టేబుల్ ముందున్న నల్లని రోజ్‌ఉడ్ కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు.

కథ చెబుతూ అతనివంక చూసాడు చిరంజీవి. చాలా ఉత్సాహంగా వింటున్నాడు. అతని కళ్లల్లో మెరుపు స్పష్టంగా కనిపిస్తోంది. సగంచెప్పి ఆగాడు చిరంజీవి. కథ మంచి పట్టులో ఉండగా అలా మధ్యలో ఆపడం నచ్చక...

"ఆగారేం?" అడిగాడు శాంతిభూషణ్. అతని ముఖంలో ఆత్రత తప్పమరో భావం కనిపించలేదు చిరంజీవికి.

తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

శాంతిభూషణ్ వింటున్నాడు.

పెద్దగా శబ్దం చేస్తూ రైలు పట్టాల మీదనుంచి వెళ్లిపోయింది. చిరంజీవి ఆగి మళ్లీ కొనసాగించాడు. మూడు వంతులు పూర్తిచేసి పక్కకు చూసాడు చిరంజీవి.

శాంతిభూషణ్ కుర్చీలో నిశ్చలంగా కూర్చుని వింటున్నాడు. అతని కళ్ళు తదేకంగా తననే చూస్తుండడం గమనించాడు. అలా అతన్ని చూస్తూనే కథ చెప్పడం పూర్తి చేసాడు చిరంజీవి.

"ఎలా వుంది?" అడిగాడు చిరంజీవి.

"ఇది మీ జీవితంలో జరిగిన సంఘటన అన్నారు కదూ?"

"అవును."

"వెల్ మిస్టర్ చిరంజీవి నేనే గెలిచాను" కుర్చీలోంచి లేస్తూ అన్నాడు శాంతిభూషణ్.

"ఒప్పుకుంటాను మీ ధైర్యానికి అభినందిస్తున్నాను" నవ్వుతూ అన్నాడు చిరంజీవి,

"అగ్రిమెంటు ప్రకారం పదివేలూ మీకిప్పుడే ఇస్తాను" లోపలికి వెళ్లబోయాడు.

"ఆగండి" అన్నాడు శాంతిభూషణ్.

"ఎందుకు?" అన్నట్టుగా చూసేడు చిరంజీవి.

"మీ కింత కంటే అద్భుతాన్ని నేను చెబుతాను. చూపిస్తాను. దీన్ని మీరు తట్టుకుంటే, మీ పదివేలు వదిలెయ్యడమే కాదు మీకు లక్ష రూపాయ లిస్తాను" అన్నాడు శాంతిభూషణ్.

చిరంజీవి నొసలు చిట్లించాడు.

"నేను నేర పరిశోధక కథకుణ్ని నన్ను మీరు అదిరించలేరు."

"అయితే షరతు కంగీకరించినట్లేనా?"

"ఆఁ"

"ఇంతసేపూ మీ కథ విన్నది మనిషి అనే మీరు నమ్ముతున్నారా?" శాంతి భూషణ్ నవ్వుతూ అడిగేడు.

చిరంజీవి పరిహాసంగా నవ్వాడు.

"మిమ్మల్ని నే నిదివరలో చూసేను, మీరు జర్నలిస్టు కనుకనే నేను చెప్పిన కథ వినగలిగారు."

"నిజమే. కాని నేను చచ్చిపోయి మూడు రోజులైంది. ఆ వార్త ఈరోజు పేపర్లో కూడా వచ్చింది."

— చిరంజీవి పకపక నవ్వేడు.

"బాగుంది కథ!" అన్నాడు.

"కథ కాదు నిజమే. నువ్వు దెయ్యాల గురించి కల్పించి రాయక్కర్లేదు. ఈగాలిలో దెయ్యాలున్నాయి" అన్నాడు శాంతి భూషణ్.

చిరంజీవి ఉలిక్కిపడ్డాడు.

ఎదురుగా శాంతిభూషణ్ లేడు. చిరంజీవి చూస్తుండగానే శాంతిభూషణ్ అదృశ్యమైపోయాడు. బల్లమీదున్న న్యూస్ పేపర్ చూశాడు ఆ వార్త కనపడ్డది.

**అంతే! చిరంజీవికి స్పృహ తప్పింది.**

# జీవన పోరాటంలో— అసల ఆరాటం

సీరియల్ పి.వి.ఆర్. శివకుమార్

ఏం ఆలోచిస్తున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియని పరిస్థితిలో హాస్టల్ చేరుకున్నాడుభాను.

ఎదురు దెబ్బతిని, ఆశాభంగం పొందిన మనసుకి రిక్రియేషన్ కావాలని పించింది. సరాసరి సూరిబాబు రూమ్‌కే పోనిచ్చాడు సైకిలు. పేకాట యింకా సాగుతూనేవుంది. వెళ్లి సూరిబాబు వెనక కూలబడ్డాడు, అప్పటికే హాండ్స్ సరిపోయి వుండటాన.

ఆ వేళ సూరిబాబు రాతా బాగుండలేదు. ఒక్క ఆట డీల్ కొట్టి డబ్బు వసూలు చేసుకుంటే, వరసగా నాలుగైదాటలు డిక్‌లో కౌంట్స్ యిస్తున్నాడు.

రాత్రి ఏడుగంటలు దాటేక, అంతా భోజనాలకి లేచారు. సూరిబాబు పూర్తిగా మునిగి, నిస్పృత్తువగా వున్నా, భాను బలవంతం మీద నలుగురితో పాటుగావెళ్లి, నాలుగు ముద్దలు తిని వచ్చాడు.

"ఎంత పోయిందేమిటి, అలాగున్నావ్?" అనడిగాడు భాను, గదిలోకి వెళ్లాక.

"హాస్టలుకి కట్టాల్సిన రెండొందలూ పోయింది అయినా డబ్బు పోయినందుకు కాదురా బాధ — యివాళ నా 'సుడి' యిలా అఘోరించిందేమిటా అని!"

స్టన్నయిపోయాడు భాను.

'గాడ్! రెండొందలు పోయిందా! ఘోరం!! రేపు మెస్‌ఛార్జెస్, అవి ఎలా? అసలే ఆ హాస్టలు క్లర్క్‌కి తామంటే పడదు. పై నెల దాకా ఆగమంటే, చచ్చినా ఒప్పుకోడు. వెంటనే డబ్బు కావాలంటే ఎలా వొస్తుందీ?"

ఆలోచిస్తూనే, టేబిల్ మీదున్న వీక్లీ తీసి తిరగెయ్య సాగాడు. సూరిబాబు మౌనంగా పడుకున్నాడు.

అరగంట గాబోలు గడిచింది. గలగలలాడుతూ ఆ గదిలో ప్రవేశించారు పేకాట మిత్రులు.

"ఏమిట్రా పడుకున్నావ్?" అంటూ.

"ఏంలేదు—కాస్త తల్నొప్పిగా వుంది." అన్నాడు సూరిబాబు.

"లేలే! అలా సెంటర్లోకి వెళ్లి, ఓ టాబ్లెట్టూ, కాఫీ తగిలిస్తే సరి! ఖర్చులు నీవి కావులే! మన వెంకుగాడివే యీ పూట ఖర్చులన్నీ! గెలిచినదంతా ఖర్చు చెయ్యద్దా మరి? పదపద, అట్నించటే రాయల్లో సెకండ్ షో గూడా!" అంటూ హడావిడి చేసేశారు వాళ్లు.

*(గత సంచిక తరువాయి)*

భానుని కూడా పిల్చాడు సూరిబాబు. భాను వెళ్దామనే అనుకున్నాడు. అంతలో రాధ మాటలు, మధ్యాహ్నం జరిగిన విషయాలు గుర్తుకు వచ్చాయి. మనసు మళ్లీ చెడింది.

"నేనానులే! మీరు వెళ్లండి. నాకు ఇంట్రస్ట్ లేదు" అన్నాడు.

"సినిమా చూడటానికి ఇంట్రస్టేమిట్రా? కాలక్షేపంగా వుంటుంది. రా..." అన్నాడు సూరిబాబు అయినా అతను అంగీకరించక పోవటంతో తనొక్కడే వెళ్లిపోయాడు వాళ్లతో.

తిరిగి తనరూముకి చేరాడు భాను.

పుస్తకాల ముందు కూర్చుని కుస్తీపడుతున్న రఘు ఓ సారి తలెత్తి, అతడికేసి చూసి, తన పనిలో నిమగ్నుడై పోయాడు మళ్లీ. "అప్పుడే మొదలెట్టేశావేమిటి చదువు?" అన్నాడు భాను.

"మాది ఫైనలియర్ బాబు! ఎప్పుడు మొదలెట్టినా ఒకంతట తరగనంత కోర్సు" అన్నాడు రఘు.

"అఫ్‌కోర్స్" అంటూ మంచం మీదికి చేరాడు భాను.

* * *

మర్నాడుదయం తెలతెల వారుతున్న వేళ......

హడవిడిగా వినిపిస్తున్నమాటలసందడికీ, అరుపులకీ మెళుకు వొచ్చేసింది భానుకి.

"ఏమిట్రా ఆ గొడవ?" అన్నాడు బద్ధకంగా, బెడ్‌మీంచి లేవకుండానే.

"ఏదోలే! నువ్ పడుకో!" అన్నాడు రఘురాం. ఆ మాటల్లో ఏదో అనుమానం ధ్వనించి, చటుక్కున లేచాడు భాను.

కిటికీలోంచి కనపడిన దృశ్యం అతణ్ణి చకితుణ్ణి చేసింది, సూరిబాబు గదిముందు గుంపుగా మనుషులు! అందులో తమకు తెలియని వాళ్లు కూడా కనిపించారు. అందరూ ఏదో ఘర్షణ పడుతున్నట్టు కనిపించింది భానుకి.

"ఏమిట్రా? ఏమయిందసలు?" అంటూ బయటికి నడవబోయిన భానుని, బలవంతంగా ఆపాడు రఘురాం.

"భానూ, నువ్విప్పుడు అక్కడికి వెళ్లొద్దు. ఏం జరుగుతుందో యీ కిటికీలోంచే చూస్తుండు. నా మాట విను." అన్నాడు.

ఆ మాటలకి మరింత ఆశ్చర్యపోయాడు భాను.

"ఏమిటది? ఏం జరుగుతోంది?"

విషయం రఘురాంకీ స్పష్టంగా తెలియదు. కానీ అతడు గత పావుగంటగా గమనిస్తున్న దాన్నిబట్టీ, వినవస్తున్న మాటల్నిబట్టీ కొంత బోధపడింది.

**జరిగినకథ 5:** అల్లరి చిల్లరిగా తిరుగుతూ చెడు సహవాసాలకి లోనైన కొడుకు భానుని పాలిటెక్నిక్‌లో చేర్పించమంటూ చెల్లెలు కౌసల్య, బావ శంకర్రావుల దగ్గరికి పంపిస్తాడు సాంబయ్య. క్రమశిక్షణకి ప్రాణం ఇచ్చే శంకర్రావుగారిసంతానం రాజు,రాధలు. హాస్టల్లో చేరిన భాను చదువుకోకుండా సిగరెట్లు తాగుతూ, పేకాడటం చూసిన శంకర్రావుగారు మందలిస్తారు. రాధకి శంకర్రావుగారు పెళ్లి సంబంధాలు చూస్తున్నారని విని బాధపతాడు భాను. సాంబయ్యగారికి పక్షవాతం రావటంతో అసలేఅంతంతమాత్రంగా ఉన్న ఆర్థిక పరిస్థితి మరింత క్షీణిస్తుంది. మనిద్దరం ఒకటి కావాలన్న భానుతో ముందు నీ బాధ్యతల గురించి ఆలోచించు అని నిర్మొహమాటంగా చెబుతుంది రాధ.

## జీవనపోరాటంలో...

తెల్లవారుఝామున నాలుగింటికే లేచి, చదువుకుంటున్న రఘురాం, ఆరు గంటలు కావస్తుండగా ముఖం కడుక్కువద్దామని బయల్దేరబోయాడు. అంతలో వెనక బ్లాక్ లోంచి మాటలు వినపడ్డాయి గట్టిగా. అటుకేసి చూశాడు.

"ఆదే గది" అంటున్నారెవరో.

ఆ వచ్చిన ఆగంతకుల్లో యువకు డొకతను గది తలుపుల్ని దడాలున నెట్టాడు. ఆ చప్పుడుకి ఉలిక్కిపడి, లేచిన సూరి బాబుకి ఎదురుగా కొత్తమొహాలు – కనిపించాయి. తత్తరపడుతూ మంచం దిగాడు.

"ఏరా – నువ్వేనా సూరిబాబువి?" అనడిగాడతను.

"అవును. ఏం?" బెదురుగా అన్నాడు సూరిబాబు.

"చెబుతాన్రా, బయటకురా ముందు–"

మీదికి రాబోతున్న అతడి దురుసుతనం చూసి, సూరిబాబు రూమ్మేటు కల్పించుకున్నాడు.

"ఎవరండీ మీరు? ఏమిటీ దౌర్జన్యం?"

"దౌర్జన్యమేరా – తడాకా చూపిస్తా నివేళ –"

"అదేదో బయట చూపించండి. ఇలా ప్రయివేట్ హాస్టల్లో ప్రవేశించి గలభాచేస్తే పోలీస్ కంప్లైంట్ యిస్తాం! ముందు బయటికి పదండి." అన్నాడతను.

"ఇవ్వరా పోలీస్ కంప్లెయింటు. వాడితో పాటుగా నిన్నూ తోయిస్తాం జైల్లోకి" అన్నాడు వెనకే ఉన్నమరో వ్యక్తి. "జైలెందుకురా వెధవలకి. యిక్కడే పాతేసి సమాధి చేస్తా" అంటూ మళ్ళీ చేతులెత్తాడు ముందున్న యువకుడు

ఇంతలో పక్కరూం వాళ్ళు వచ్చారు.

"ఏమిటి మాష్టారూ, ఏమయిందసలు? ఏమిటీగోల?" అంటూ.

"అలా అడగవయ్యా చెబుతాం..." అంటూ ఏదో చెప్పబోతున్న వెనకతన్ని ముందు వ్యక్తి ఖండించాడు.

"ఏమిటి బాబాయ్, వీళ్ళకి చెప్పేది- అంతా ఒక్కటే రకం– చదువుకోవటానికని వచ్చి, ఊరిమీద పడే కుక్కలు..."

'ఏయ్ మిస్టర్, మాటలు మర్యాదగా రానియ్. ముందు వరండా దిగి మాట్లాడు" అంటూ అతణ్ణి బలవంతాన బయటికితీసుకు వచ్చారు మిగతావాళ్ళు.

"ఏమిట్రా మీ దగ్గర మర్యాద? ఈ స్టూడెంట్ నాయాళ్ళకి మర్యాదొకటా? అర్ధరాత్రివేళ రోడ్డుమీద ఆడపిల్లలు కన బడితే, మదమెక్కి వెర్రివేషాలేస్తారా? అంత దూలగా వుంటే, పోయి మీ చెల్లెళ్ళ దగ్గర..."

"నోర్మూయ్" పక్క రూమతను ఆ యువకుడి మీద చెయ్యి విసిరాడు.

"దొంగ నా ...! చెయ్యి చేసుకుంటావురా! ఈవాళ నీ ఎముకలు విరిచేస్తాన్రా! నా సంగతి నీకు తెలీదురా—"

అతడు దెబ్బ పడటంతోనే రెచ్చిపోయి, కేకలు పెట్టసాగాడు.

ఆ కేకలకే భానుకి మెళుకువొచ్చింది.

ఆ అరుపులవల్లే రఘురాంకి కథ కొంత వరకు తెలిసింది రాత్రి సెకండ్ షో నించి వస్తూ సూరిబాబు బృందం ఎవరో అమ్మాయిల్ని అల్లరి పెట్టారు, వాళ్ళ తరుఫువాళ్ళు పొద్దున్నే హాస్టలు మీదికి వచ్చారు!

రఘురాంకి అసహ్యం వేసింది ఆ కొత్త వ్యక్తి అంటున్నమాటలకి సిగ్గూ కలిగింది. ఒక్కడు చేసిన పనికి మొత్తం హాస్టల్ని, మొత్తంవిద్యార్థిలోకాన్నేదుయ్యబడుతున్నారు. కానీ అది అతని తప్పెలా అవుతుంది? మేకలూ, మేకవన్నె మృగాలూ ఒకే అడవిలో తిరుగుతుండగా, ఏది మేకో, ఏది మృగమో తెలుసుకోవటం ఎలా? కనపడ్డ జంతువునల్లా కాల్చి పారెయ్యాలనుకోవటం తప్పెలా?

అంతలో భాను లేవటంతో అతను వాస్తవంలోకి వచ్చాడు ఇప్పుడీ గొడవలో భాను అక్కడికి వెళ్తే అతడికీ నాలుగు తగుల్తాయి. ఇప్పటికే సూరిబాబు బృందంలో 'లబ్ధప్రతిష్ఠుడై'న కారణాన, యితడికి ఆ నేరంలో భాగం లభించి తీరుతుంది. అతడు రాత్రి వాళ్లతో వెళ్లలేదని మొత్తుకున్నా వినిపించుకునే నాథుడుండడు.

అందుకే గది తలుపులు గడియ పెట్టేసి సంగతి ట్ూకీగా వివరించి, భానుని బల వంతాన బయటికి పోకుండా ఆపేడు రఘురాం.

మరో పావుగంట ఘర్షణ తరువాత జరిగిందేదో వార్డెన్ దగ్గరే తేలుద్దామని, మధ్యవర్తులుగా వున్న విద్యార్థులు సర్ది చెప్పాక, అందరి ఆవేశాలూ ఒక దారికి వచ్చాక, చేతులు కలపటం ఆపి, వాదనల్తోనే సరి పెడుతూ నిలబడ్డారు వాళ్ళు.



మరి కాస్సేపట్లో కబురందుకుని వచ్చాడు వార్డెన్.

వార్డెన్‌కి సూరిబాబు అన్నా, అతడి బృందమన్నా అతి వాత్సల్యం! వాళ్ల ఘన కార్యాలు ఆయకీ తెలుసు.

అయినా హాస్టలు మర్యాద, ప్రతిష్ఠ కాపాడవలసిన బాధ్యత వుండటాన, ఆ పెద్ద మనుషులకి సర్దిచెప్పి, నేరం చేసిన వాళ్ల మీద చర్య తీసుకుంటానని మాట యిచ్చి, వాళ్లని చల్లార్చి యింటికి పంపించాడు.

వాళ్లు వెళ్లటంతోనే సూరిబాబునీ, మిగతా వాళ్లనీ వెంట బెట్టుకు హాస్టల్ ఆఫీసు రూంకి వెళ్లాడాయన.

అరగంటసేపు చర్చలు, వాదోపవాదాలు జరిగాయి. చివరికి సూరిబాబునీ, మరో యిద్దరు విద్యార్థుల్నీ డిబార్ చేస్తున్నట్లు ప్రకటించాడు వార్డెన్. ఆయనే కాలేజీకి ప్రిన్సిపాల్.

స్వతహాగా మిగతా విద్యార్థులకీ, స్టూడెంట్స్ కమిటీ మెంబర్లకీకూడా వాళ్ల మీద సదభిప్రాయం లేకపోవటాన, వాళ్లూ గట్టిగా ఎదురు చెప్పలేదాయనకి. ఇరవై నాలుగు గంటల్లోగా హాస్టల్ ఖాళీ చెయ్యమని ఆర్డర్ జారీచేసి, వెళ్లిపోయారాయన.

ఆ తరవాత భాను బయటికి వచ్చాడు. అతణ్ణికూడా అందరూ పురుగుని చూసినట్టే చూడసాగారు — ముఖ్యంగా డిస్మిసయిన సూరిబాబూ, అతడి బృందమూ! వాళ్లు అందరిఎదటా అన్నారుకూడా, "వీడు మాత్రం ఎలా వుండిపోతాడో చూస్తాం!

# జీవనపోరాటంలో...

తిరిగినన్నాళ్లూ మాతో తిరిగి, రాత్రి మాతో రానంత మాత్రాన పతివ్రతగాడై పోయేడా? మేం కదిలితే వాణ్ణి మాతోనే తీసుకు మరీ పోతాం" అంటూ.

భాను మాటెలావున్నా, రఘురాంకి భయంవేసింది ఆ మాటలు వినగానే.

"నువ్విప్పుడింక యిక్కడుండొద్దు భానూ! వెంటనే మీ అత్తయ్యగారింటికో, మీ వూరికో వెళ్లిపో! వారం రోజులదాకా రావొద్దు. అప్పటికి వీళ్లూ వూరు విడిచి వెళ్లిపోతారు. యీ గొడవలూ తగ్గిపోతాయి. జ్వరపడ్డావని నేను మీ లెక్చరర్స్‌తో చెప్తాను." అని, అతడికి నచ్చచెప్పి, ఆ మధ్యాహ్నమే ఎవరికీ తెలిని విధంగా అతణ్ణి హాస్టల్ దాటించాడు. భాను ససేమిరా వద్దని వారిస్తున్నా వినకుండా, అతడితో పాటూ షుగర్ ఫాక్టరీదాకా వెళ్లి, శంకరావు గారిని కలుసుకున్నాడు. జరిగిన విషయమూ చెప్పి, అందులో భాను నిర్దోషిత్వాన్ని వివరించి, 'ప్రస్తుతం హాస్టల్లో వుంచటం ప్రమాదం. వో వారం రోజులదాకా మీ యింట్లోంచి కదలనీయొద్దు. ఈలోగా ఫర్వాలేదనిపిస్తే నేనేవచ్చి తీసుకువెళ్తా'నని చెప్పాడు.

రఘురాం మీద శంకరావుగారికి కొంత నమ్మక ముంది. ఆయన ఎప్పుడు హాస్టలుకి వెళ్లినా, రూమ్‌లోనే కూర్చుని, బుద్ధిగా చదువుకుంటూ కనబడేవాడు గనకా, మాటల్లోనూ మర్యాదా, వినయం వుంటాయి గనగా ఆయనకా నమ్మకం కుదిరింది.

భాను కేసి నిరసనగా చూసి, "అలాగే నోయ్, పాపం! చాలా శ్రమ తీసుకున్నావు. థాంక్స్." అన్నారు రఘురాంతో.

"అదేమిటండీ, అలా గంటారు. రూమ్మేటు గనక ఆ పాటి చెయ్యటం నా ధర్మం" అనేసి, భానుతో చెప్పి, వెళ్లి పోయాడు రఘురాం.

"ఊఁ! బాగుంది. ఇంటికెళ్లు" అన్నారు శంకరావుగారు. తల వంచుకుని, అవమానంతో బయట పడ్డాడు భాను. ఇంటికి వెళ్లినా, కౌసల్యతో ఏమీ చెప్పలేదతను. ఒకటి రెండుసార్లు 'ఇదేమిటే? ఈ వేళప్పుడొచ్చావ్? క్లాసు లేదా?' అని అడిగి, సరయిన జవాబు రాబట్టుకోలేక వూరుకుందావిడ. రాధకి మాత్రం అక్కడేదో గొడవ జరిగి వుంటుందని అర్థమయింది.

ఆ సాయంత్రం యింటికివచ్చాక, జరిగినదంతా భార్యకి చెప్పారు శంకరావుగారు.

"ఆ చెడు స్నేహాలెందుకురా నీకు? రఘురాం లాటి రూంమేట్ వుండీ, అతడి మంచి నీకు పట్టలేదు. ఇంకా యిలాగైతే, ఎప్పుడు బాగుపడతావు భానూ! అవతల మీ నాన్న పరిస్థితి అలా వుంది — యివతల నీ ప్రవర్తన యిలా వుంది! ఎప్పటికి బుద్ధొస్తుందిరా నీకు—అసలొస్తుందా?" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకుంది కౌసల్య.

ఒకప్పుడయితే యిలాటి మాటలకి ఎదురు తిరగాలనిపించేది. కానీ, నిప్పటి రాధ మాటలకి సగం క్రుంగిపోయిన భాను మనసు, ఉదయం జరిగిన సంఘటనతో మరింత దిగజారిపోయి, ఇప్పుడిహ కోపం తెచ్చుకోవటమో, చిరాకు పడటమో చేసే పాటి శక్తిని కూడా కోల్పోయింది.

ఎవరిని ఎందుకు నిందించాలో, తనని తనే నిందించుకోవాలో కూడా నిశ్చయించుకోలేని జడత్వంలో రాయిలా వుండిపోయేడతను అత్త మాటలు వింటూ.

## 15

అక్కడున్న వారం రోజులు జైలుశిక్ష అనుభవిస్తున్న వాడిలా గడిపాడు భాను. రాజా గానీ, రాధగానీ, శంకరావు గారు కానీ అతనితో ఒక్కమాట కూడామాట్లాడలేదు. కౌసల్యమాత్రం భోజనానికీ, టిఫిన్లకీపిలిచేది. వేళకి తినటం, మిగతా దినమంతా చేతిలో



# మా పిల్లలకు అధిక శక్తినిస్తుంది...
# అగ్రస్థానం చేకూర్చుతుంది...
# కోకో-రుచిగల బోర్న్‌విటా!

బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది.దానిని మరింత రుచికరంగా-ఆరోగ్యంగా చేసేందుకు

అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది. మీకు గూడా బోర్న్‌విటా అవసరం. వారికి తగ్గట్టుగా ఉండేందుకు!

## క్యాడ్‌బరీస్
# బోర్న్‌విటా

అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!







OBM 8376A/TL

ఏదో ఒక పుస్తకం పుంచుకొని, మనసు మరెక్కడో ఆలోచిస్తుంటే, పిచ్చిపిచ్చిగా సాగిపోయే ఆలోచనల్లోనే మునిగి పోవటం!

అతడక్కడికి వచ్చిన మర్నాడే రఘురాం మళ్లీవచ్చి, అతనికి కొన్ని టెక్స్టుబుక్స్, కొన్నినోట్‌బుక్సూ యిచ్చి వెళ్లాడు—యీ వారం, పది రోజులూ చదువు కోవటానికి పుంటాయని. అతడికి తనమీదవున్న శ్రద్ధ, తను అతడితో అంత స్నేహంగా వుండక పోయినప్పటికీ, చూడగానే భాను మనసు అవ్యక్తమయిన అనుభూతికి గురై, అందుకు గుర్తుగా కళ్ళు చెమర్చాయి.

సరిగ్గా ఎనిమిది రోజుల తరువాత సోమ వారం ఉదయం తిరిగి హాస్టల్‌కి వచ్చాడు భాను. ఈ వారంరోజుల్లోనూ అతను నిజం గానే జబ్బుపడ్డ మనిషిలా తయారయ్యాడు. శారీరక రుగ్మతకన్నా మానసికంగా అనుభ వించేబాధ మనిషిని ఎంతయినా కృంగతీస్తుం దనటానికి నిదర్శనంగా. శంకర్రావుగారు రాజునీ, రాధని అతనితో మాట్లాడవద్దని శాసించటం చాలు— అతడు సిగ్గుతో, అవ మానంతో కృంగిపోవటానికి. ఆ వారం రోజులూ, దినదినం ప్రతి క్షణం అతడు 'హాస్టల్‌కి వెళ్లిపోతే గానీ నేను తిరిగి హాయిగా గాలి పీల్చలేను' అనుకుంటూ గడిపాడు.

కానీ, హాస్టల్‌కి వచ్చేసినా, అతడిమనసు పూర్వపు రిలీఫ్ పొందలేక పోయింది!

కాలేజీకి వెళ్ళిన అరగంటకే ప్రిన్సిపాల్ నుంచి పిలుపు వచ్చింది భానుకి. బెదురు, బెదురుగా వెళ్లి ఆయన గదిలో అడుగు పెట్టాడు.

"ఏమోయ్, ఆరోగ్యం బాగుండకరాలేదా యిన్నాళ్లూ?" అడిగారాయన.

"అవును సార్! ఫీవర్..."

"నాదగ్గిరింకా అబద్ధాలు చెప్పకు. నువ్వు యిన్నాళ్ళు హాస్టలు విడిచి ఎందుకు వెళ్లావో, ఎక్కడ వున్నావో అన్నీ నాకు తెలుసు. నువ్వు వెళ్లిన మర్నాడే మీ అంకుల్ నాకు ఫోన్ చేశారు.

ఆ రోజు రాత్రి నిజంగానే నువ్వు వాళ్లతో వెళ్లలేదు కాబట్టి సరిపోయింది. ఇకనుంచీ నీమీద ఓ కన్ను వేసే వుంచుతాము. ఏవయినా పిచ్చివేషాలు వేసినట్లు తెలిసిందా, ఆ రోజే యింటికి పంపెయ్యాల్సి వుంటుంది జాగ్రత్త!

ఇకనుంచయినా బుద్ధి తెలుసుకుని, జాగ్రత్తగా చదువుకో."

వంచిన తల ఎత్తకుండా విని, అక్కడి నించి బయటికి రాబోతుండగా, హాస్టల్ క్లర్కు అక్కడికి వచ్చాడు. భానుని చూస్తూనే, "ఏమండీ, మీరింకా ఫీజు కట్టలేదే?" అన్నాడు.

"ఏమోయ్, ఇంకా ఫీజు కట్టలేదూ?" అడిగారు ప్రిన్సిపాల్.

## ఎందుకంత విహ్వలత?

—డా. సి. నారాయణరెడ్డి

పక్షి నేలను దున్నుతుందనీ
పాము విత్తనాలను చల్లుతుందనీ
పండిన పంటను చూసి మృత్యువు
భళీ భళీ అంటుందనీ;

ఒకానొక ఫ్రెంచి కవి
పుకిలించిన మాటలు కని
ఎందుకంత
విహ్వలత?

కాలు నేలను దున్నుతుందనీ
చేయి విత్తనాలను చల్లుతుందనీ
పండిన పంటను చూసి పచ్చి ఆకలి
విందు కొండగా మండుతుందనీ

ఒకానొక దేశి కవి
ప్రకటించిన పలుకులు విని
రాదెందుకు
విప్లవత?

"లేదుసార్, యివేళ కట్టేస్తాను" అనేసి, తొందరగా బయటపడ్డాడు భాను. ఇంక అతనికి క్లాసుకి వెళ్లబుద్ధికాలేదు. కానీ, ప్రిన్సిపాల్ గమనిస్తే ప్రమాదం. అందుకే బలవంతాన వెళ్లి, మిగతా విద్యా ర్థుల హేళన చూపుల్ని భరిస్తూ కూర్చు న్నాడు. మనసు మాత్రం ఆలోచనల్లో పడింది.

'అవును. హాస్టల్ ఫీజు కట్టాలి. సుమారుగా వంద రూపాయలపైగా కట్టాలి. వెధవ పేకాటలో పోయిందా డబ్బు!

ఇప్పుడది కట్టకపోతే, మామయ్యకు కబురు వెళ్లవచ్చు! అమ్మో, ఏమయినా సరే, యీ విషయం ఆయనదాకా వెళ్ల టానికి వీల్లేదు. కానీ, ఎలా?'

ఆలోచించగా, ఆలోచించగా ఒకే ఒక్క ఉపాయం తోచింది మనసుకి. దాంతో మనసు తేలికపడింది.

లంచవర్లో రఘురాంని కల్సుకున్నాడు భాను.

"అర్జంటుగా ఓసారి బజార్లోకి వెళ్లి రావాలి రఘూ! వస్తావా?" అడిగాడు.

"యిప్పుడేనా? ఏమిటంత అర్జంటు?"

"చెప్తానుగా! రారాదూ?"

"ఉండు. ఏకంగా భోంచేసి వెళ్తే, సరాసరి క్లాసుకి వచ్చేయొచ్చు పని కాగానే!" అన్నాడు అతను. ఇద్దరూ మెస్‌కి వెళ్లి, అక్కడి నుంచి బజార్లోకి నడిచారు దారిలో చెప్పాడు భాను.

"నా ఉంగరం అమ్మెయ్యాలి!"

ఉలిక్కిపడ్డాడు రఘురాం!

"ఉంగరం అమ్మేస్తావా? ఎందుకు?"

చెప్పాడు భాను.

"పోనీ ఎవర్నయినా అప్పడిగితేనో?"

"ఎవరిస్తారు రఘూ నా కంత అప్పు? అయినా అప్పు మాత్రం తీర్చవద్దూ? అంతకన్న యిదేనయం."

"మీ వాళ్లకి తెలిస్తే?"

అవును. తెలియక తప్పదు. తను రెండు సార్లు తప్పినా, చివరికి యస్. యస్. యల్. సి ప్యాసయినందుకే తండ్రి ముద్దుగా చేయించిన ఉంగరం యిది! అమ్మేశానని తెలిస్తే చాలా బాధపడతారు. కానీ యిప్పుడు పేకాటలో డబ్బు తగలేసి మళ్లీ కావాలని రాస్తే మటుకు బాధపడరూ? ఇంతకన్నా, ఉంగరం పోయిందని చెప్తేనే నయంకదూ!

అతడికి తెలియకుండానే, జీవితంలో మొదటిసారిగా తల్లిదండ్రుల కష్టసుఖాల గురించి ఆలోచించాడు భాను!!

"ఫర్వాలేదు — అమ్మినట్లు కాకుండా, ఎక్కడో పోయిందని చెప్తానులే! హాస్టల్లో డబ్బు కట్టటం మాత్రం ముఖ్యం. అందుకే యింతకన్నా మార్గంలేదు."

ఏం చెప్పాలో తోచలేదు రఘుకి. అందుకే మౌనంగా అనుసరించాడతణ్ణి.

చేయించినప్పుడు రెండు వందల రూపా

(36వ పేజీ చూడండి)

# పుష్కలమైన బోనస్ నురుగు,
# బట్టలు రెండింతలు తెలుపు!

ధర కేవలం
**88** పైసలు
పన్నులు అదనం




# బోనస్

పొదుపైన డిటర్జెంట్ బిళ్ళ

బోనస్ అత్యుత్తమమైన సబ్బులతో పోల్చి చూస్తే 50% ఎక్కువ బట్టలను మరింత తెల్లగా, కాంతిగా ఉతుకుతుంది. బోనస్‌తో ఉతికిన బట్టలకు తెలుపుజేసే లేక నీలి మందు పదార్థాలు అవసరం లేదు. ఇప్పుడు ఇది వరకటి కంటె ధర కూడా తక్కువ.

టామ్‌కో ఉత్పాదనలు—సరసమైన బేరం
ధర స్వల్పం...పని ఉత్తమం
ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

CMTB-19 253 TL

**సీరియల్**

# రాగబంధం

## యార్లగడ్డ సరోజినీదేవి

**14** *(గత సంచిక తరువాయి)*

**వి**జయ లేచేసరికి చాలా ఆలస్యమయింది. ఎప్పుడూ అంత ఆలస్యంగా లేవని విజయ తొందరగా లేచివచ్చేసరికి హాల్లో కూర్చుని పేపర్ చూస్తున్నాడు శ్రీనివాస్ తను లేవటమే ఆలస్యమయిందనుకున్నదిగాని శ్రీనివాస్ లేచే టైం అదికాదే! ఉదయమే లేచి పేపర్ చదివేటంత బుద్ధిమంతుడు ఒక రాత్రిలో ఎలాఅయిపోయాడబ్బా?

"గుడ్ మార్నింగ్ విజయా!" చిన్నగా నవ్వాడు శ్రీనివాస్

"మార్నింగ్ చినబావా? నేనేమీ కలకనటం లేదుకదా?"

"దేనికి?"

"ఏడులోపలే నువ్వు మేడ దిగి రావటం, దినపత్రిక చూడటంలాంటిది ఇతరులను విష్ చేయటంలాంటి మంచి సుగుణాలు స్వభావసిద్ధంగా వచ్చినట్టులేదే?"

"ఓ! అదా!..."

అంటూ బిగ్గరగా నవ్వాడు శ్రీనివాస్!

అన్నీ మర్చిపోయి యెంత తేలికగా నవ్వగలుగుతున్నాడో? మనసులోనే అసహ్యించుకుంది విజయ

"రాత్రి నాకొక కల వచ్చింది విజయా! ఎంత మంచి కలనుకున్నావ్?"

"... . .."

"ఎలాంటి కలని అడగవే విజయా?" సోఫాలోనుంచి లేచి దగ్గరకు వచ్చి అడిగాడు.

"నువ్వు చెప్పే కట్టుకథలు నమ్మటానికి నేనేమీ మేలీనికాదు చినబావా?"

జవాబుకయినా ఎదురుచూడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

స్థాణువయిపోయాడు శ్రీనివాస్! అంతలోనే కోపం బుసలుకొట్టింది చేతిలో చెయ్యి వేసుకుని వేళ్ళు నలుపుకున్నాడు కసిగా; టిఫిన్ ఆపూట నాయరే వడ్డించాడు విజయ ఆరోజుమొదలు శ్రీనివాస్‌ని తప్పించుకుని తిరుగుతోంది అతనికి ఏమి కావలసినా నాయరే చూస్తున్నాడు. ఆలస్యంగా వచ్చిన రాత్రిళ్ళు మాత్రం తనే వడ్డించేది. అది కూడా మౌన వాతావరణంలోనే! శ్రీనివాసే ఎంతో పలుకరించాలని చూసేవాడు విజయని ఆ క్షణానికి అతని ముందునుంచి అవతలికి వెళ్ళిపోయేది.

అలా నాలుగురోజులు గడిచేసరికి శ్రీనివాస్‌కి ఎంతో బాధగా వుంటోంది ఎలాగయినా విజయతో మాటలు కలపాలని యెంతో ప్రయత్నించి విఫలుడైపోయాడు. వేళకి తనకేమి కావలసినా అన్నీ చూసి మరీ ఆ టైంకి బలవంతంగా తినిపించేది అలాంటి విజయ ఇలా మౌనం వహించేసరికి కంపరంగా వున్నది. విజయమీద కసికొద్దీ బైట యెక్కువసేపు వుండసాగాడు అందుకూ బాధపడలేదు విజయ

భాస్కర్ ఊరి నుంచి రాగానే విజయ అడిగింది ముందుగా సుందరి ఆరోగ్యం గురించి

"కాలేజీలో చదివి చదివి అలిసిపోయి ఇంటికి వచ్చేసరికి బోర్‌తో ఫీలవకుండా ఆడుకోవటానికి నీకో పాపాయిని యివ్వబోతోంది మీ అక్కయ్య!" అన్నాడు భాస్కర్.

"ఎంత మంచిమాట చెప్పావు పెదబావా? అందుకేనన్నమాట! తీపి తింటూ యిన్ని రోజులూ అక్కడే వున్నావు?"

"మీ అక్కయ్య రానివ్వకపోతే నన్నేమి చేయమంటావు?"

"పో బావా?... నీదంతా సోద్యం! నీకే రావాలనిలేక వుండిపోయి అక్కయ్యమీద నెపం నేస్తున్నావు?"

"పోనీ అలాగే అనుకో! నాన్నగారేమీ కబురు చెయ్యలేదా?"

"ఒక రోజయితే చూడకుండా వుంటారుగాని ఏకంగా నాలుగు రోజులు కనిపించకపోతే ఎలా వుంటుంది చెప్పు? అక్క దగ్గరకు వెళ్ళావని చెప్పానుగాని త్వరగ స్నాన భోజనాలు పూర్తిచేసి తోటలోకి వెళ్ళండి!"

"అలాగేనమ్మా! నీ ఆజ్ఞ మీరేటంత శక్తి ఈ ఇంట్లో ఎవరికీ లేదని తెలుసునేవున్నది!"

అని బాత్ రూంలోకి వెళ్ళాడు భాస్కర్. శ్రీనివాస్ బైటకి వెళ్ళబోతూ హాలులోనే తచ్చాడటం మొదలుపెట్టాడు అతని జేబులో డబ్బులు అయిపోయి నాలుగు రోజులు అయింది విజయని అడగట మేమిటన్న పౌరుషంకొలదీ పుట్టినచోటల్లా అప్పు చేసి వాడుకున్నాడు. పాత బాకీ చెల్లించితేనేగాని కొత్త అప్పు యివ్వనన్నారు భాస్కర్ ఊరినుంచి రావటం చూసి అన్నగారి నయినా అడగాలని నిర్ణయించుకున్నాడు.

శ్రీనివాస్ అలా తచ్చాడుతుంటే విజయకి అర్థమయింది. అలా డబ్బు కావలసివుంటేనే ఎక్కువసేపు వుంటాడని తెలుసు మేనత్త యిచ్చిన డబ్బు తీసుకెళ్ళి శ్రీనివాస్‌కి యిచ్చింది

"డాడీ యివ్వమని చెప్పారా?" నోట్లవంక పరమానందంగా చూసుకుంటూ అడిగాడు.

"కాదు! అత్తయ్య నీ కివ్వమని యిచ్చింది ఆమధ్య నేను తోటలోకి వెళ్ళినప్పుడు!"

"ఇప్పటివరకూ యివ్వలేదే?" కోపంతో ప్రశ్నించాడు

"అవకాశం రాలేదు!"

"నీకా? డబ్బుకా??"

"... ... ... ."

"అయితే ఈ డబ్బు డాడీ యివ్వలేదన్న మాట?... ఊఁ... అందుకే నాకు డాడీ అంటే అంత అయిష్టం! తనకి డబ్బు సంపాదించటమే తెలుసుగాని; సుఖసంతోషాలు పొందాలన్న కోరికలు లేని వైరాగ్యపు మనిషి. ఎదుటివాళ్ళ కోరికలు ఎలా అర్థం అవుతాయి?"

"ఈ డబ్బుకూడా మామయ్య సంపాదన అన్న సంగతి మర్చిపోతున్నావు!" కోపంగా జవాబు చెప్పింది విజయ.

"మీ మామయ్య దేమీ కాదులే! యిదంతా మీ అత్తయ్యది! ఆమెకున్న బంగారాన్నంతా అమ్మి వ్యాపారంపెట్టి సంపాదించినది! మీ అత్తయ్య అడుగు పెట్టినప్పటినుంచే ఆయనకీ మహర్దశ కలిగిందట!"

"అలాగని నీకెవరు చెప్పారు?"

"అందరూ అనుకుంటుంటే విన్నాను.

**జరిగిన కథ-10.** ముప్పయ్యేళ్ళతర్వాత పుట్టింటి కెళ్ళిన పార్వతమ్మ, వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకువస్తుంది తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మేనని రామనాథం నమ్మకం. పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం అతని భార్య సుందరి సుందరికి నల్గురితో కలిసిమెలిసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకుతనం ఎక్కువ. పాతికేళ్ళ క్రితం... పరంధామయ్యగారి కొడుకులు జగన్నాధం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు. కాపురానికి వెళ్ళకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాధంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి. ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి. పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్ళు మూస్తాడు పరంధామయ్య ... విజయ బి. ఏ. లో చేరుతుంది. చదువుమీద శ్రద్ధలేక దురలవాట్లకు లోనైన శ్రీనివాస్ దుడుకు స్వభావాన్ని చూసి బాధపడుతుంది విజయ. శ్రీనివాస్ స్త్రీలోలుడని తెలుసుకున్న విజయకు అతనిపై అసహ్యం కలుగుతుంది.

వారాలు చేసుకుని బ్రతికిన రామనాథంగారికి!...''

''శ్రీనివాస్!''

మధ్యలో అందుకుని పెద్దగా అరిచింది విజయ. అంత పెద్దగా అరవటంతో తెల్లబోయాడు శ్రీనివాస్. ఆమె కళ్ళల్లో నుంచి కురుస్తున్న అగ్నికణాలను చూడలేక తల వంచుకున్నాడు.

''కన్నతండ్రినే విమర్శించే నీ అల్పత్వం ఎంత హీనస్థితికి దిగజారిందో అర్ధంఅవుతున్నది. వారాలు చేసుకుని బ్రతికినా; భార్య వస్తువులు అమ్ముకుని పరువుగా మామయ్య బ్రతికారు! నీలాగా పరువుని బజారున మాత్రం వేసుకోలేదు. ఎప్పటికయినా బిజినెస్ మాగ్నెట్ రామనాథం గారబ్బాయినని చెప్పుకుని బ్రతకవలసినవాడివే!''

జవాబుకయినా ఎదురుచూడకుండా విసురుగా లోపలికి వెళ్ళిపోయింది విజయ.

ఎంత పొగరు? వుండి వుండి యెంత సూటిగా; వాడిగా; ధాటిగా మాట్లాడుతుందో? అమ్మ రాగానే విజయ సంగతి తేల్చుకోవాలి! బిజినెస్ మాగ్నెట్ రామనాథమట! రామనాథం! నయాపైసా తను ఖర్చుపెట్టుకోలేడు. మమ్మలను ఖర్చుచెయ్యనివ్వడు. ఆయన వచ్చేవరకూ ఇంటిపెత్తనం ఈ మహారాణిదే కాబోలు! అదేమిటో చూస్తాను! ఈ శ్రీనివాస్ సంగతి విజయకి తెలియచెప్పాలి! పళ్ళు నూరుకుంటూనే బైటికి వచ్చి స్కూటర్ స్టార్టు చేశాడు.

శ్రీనివాస్ వెళ్ళిన అరగంటకి విజయ పుస్తకాలు పట్టుకుని కారు దగ్గిరకు రాగానే డ్రైవర్ డోరు తెరిచి పట్టుకున్నాడు. విజయ సీటులో కూర్చోగానే డోరు మూసి కారు స్టార్టు చేశాడు.

విజయ కాలేజీ దగ్గిర దిగిన తరువాత డ్రైవర్ నిలబడివుండటంతో ఏమిటని అడిగింది.



''సాయంత్రం కారు తెమ్మనమంటారా అమ్మా !''

''అవసరంలేదు! ఎప్పటిలాగా బస్సుమీదనే వచ్చేస్తాను. ఇక నువ్వు వెళ్లిపోవచ్చు!''

డ్రైవర్ నమస్కరించి కారు డ్రైవ్‌చేసుకుని వెళ్లిపోయాడు. నడుస్తున్న విజయ హఠాత్తుగా నిలబడిపోయింది. ఒకసారికాదు! పదిసార్లు తేరిపార చూసింది. మరలా మరలా చూసింది!

సందేహం లేదు! శ్రీనివాస్‌తోపాటు మేడ దిగివచ్చిన వనిత! కాదు! మేరీ! కాలేజీలో కూడా ఆ హొయలు! ఆ వగలు! శరీరం కనిపించే టట్టుగా ఆ నైలాన్ చీర!

''ఏమిటలా నిలబడిపోయావు ?'' క్లాసుమేటు సునందిని వెళ్తూ విజయని చూసి ఆగి ప్రశ్నించింది.

''ఆ వెళ్లే అమ్మాయి ఎవరా? అని చూస్తున్నాను!''

''ఓ!... ఆమెగారా? మిస్ మేరీ అని! రోజు రోజుకీ రంగులు మార్చే ఊసరవెల్లి! మనిషిని చూడగానే తెలుస్తుంది! క్లియోపాత్రాకి రాజ్యకాంక్ష వుంటే దీనికి డబ్బు కాంక్ష! పిచ్చి పిచ్చి వేషాలపై కాంక్ష! డబ్బున్నవాడంటే కాంక్ష! వాడిన గులాబీ పువ్వు అది!'' లెక్చరర్ రావటం చూసి సునందిని ముందుకు కదిలింది ఏమీ ఎరుగనిదానిలా! మేడంకి మార్నింగ్ చెప్పి తన క్లాసు రూంకి వెళ్లింది విజయ.

''వాడిన గులాబీ పువ్వు!''

సునందిని అన్న మాట పదే పదే విజయ చెవిలో మారుమ్రోగుతోంది.

''డబ్బున్నవాడంటే కాంక్ష!''

అందుకే శ్రీనివాస్‌ని తన వగలు హొయలుతో వలలో వేసుకున్నది. మేరీకి పూర్తిగా అంకితం కాకముందే శ్రీనివాస్‌ని దక్కించుకోవాలి! తాను అతనిమీద కోపం తెచ్చుకుంటే ఆదరించిన అత్తయ్య మామయ్యకి ద్రోహం చేసినట్లే అవుతుంది. మేరీ లాంటి చీడపురుగులు వుంటే మగవాడు అనుకోకుండానే పతనమవుతాడు. తనేమయినా కృతజ్ఞతలు చూపించుకోవాలంటే శ్రీనివాస్‌ని మేరీ కబంధహస్తాలనుంచి తప్పించ గలగటమే!!...

## 15

హాల్లో ఫోన్ గణగణ మంటుంటే చదువు కుంటున్న విజయ లేచివెళ్లి రిసీవర్ తీసుకున్నది.

''శ్రీనివాస్ వున్నాడా ?''

అవతల మాట్లాడేది స్త్రీ అని వెంటనే పోల్చుకున్నది విజయ.

''మీరెవరో చెప్పండి!''

''నేను మేరీని! శ్రీనివాస్‌తో అర్జంటుగా మాట్లాడాలి! సాయంత్రం ఆరు గంటలకు పబ్లిక్ గార్డెన్‌కి రమ్మనమని చెప్పు! ఆఁ... యింతకీ శ్రీనివాస్ లేడా ?''

''లేడు!''

''నువ్వెవ్వరివి ?''

''ఈ ఇంటిలో ఒక మనిషినిలెండి!'' నవ్వుతూ సమాధానమిచ్చింది. ''నువ్వు ఎవరివయితే నాకేమిగాని శ్రీనివాస్‌తో చెప్పటం మాత్రం మర్చిపోవద్దు!''

అవతలవైపునుంచి ఫోన్ పెట్టేసిన చప్పు డవటంతో చిన్నగా నిట్టూర్చుతూ ఫోన్ హుక్‌మీద పెట్టి వెనక్కి తిరిగేసరికి మేడమెట్లు సగం దిగి వచ్చి అక్కడే ఆగిపోయిన శ్రీనివాస్ తీక్షణ దృక్కులు తనను నఖశిఖ పర్యంతం పరిశీలించు తున్నవని గ్రహించి తల వంచుకుని తిరిగి సోఫాలో కూర్చుంది.

''ఫోన్ చేసింది బాయ్‌ఫ్రెండా ? ?''

''కాదు! గరల్ ఫ్రెండ్!''

''నీకూ గరల్ ఫ్రెండ్సు వున్నారన్న మాట?''

''వున్నారో ? లేదో నీకు అనవసరం! అని అనాలనుకున్నదిగాని!'' అనలేకపోయింది. మేరీ సాయంత్రం రమ్మనమని చెప్పితే యిప్పుడే శ్రీనివాస్ వెళ్లిపోతాడు. అతను మేరీని కలుసుకో కుండా వుండాలనుకుంటే చెప్పకుండా వుండటమే మంచిది.

''నాదగ్గిర దాచాలనుకోవటంలో నువ్వు పొరపాటు చేస్తున్నావనుకుంటాను! గరల్‌ఫ్రెండ్ అయిందీ బాయ్‌ఫ్రెండ్ అయిందీ తెలుసుకోలేనంత మూర్ఖుడిని కాదులే!...'

''ఏమిటి నువ్వు తెలుసుకున్నది ? దగుల్బాజి పనులు చేయటం నా అభిమతానికి విరుద్ధం. నువ్వేలా అర్థం చేసుకున్నా అది నాకు అనవసరం. నా మంచి చెడులేవో నేను తెలుసుకోగలను! తెలుసుకోలేకపోతే మందలించేందుకు అత్తయ్య మామయ్యా వున్నారు!''

''పౌరుషానికేమీ లోటు లేదు!''

''అవును! ఆత్మాభిమానం కాపాడుకోవా లనుకునేవాళ్లకి పౌరుషం లేకపోతే నీలాంటివాళ్ల దగ్గిర మనుగడ సాగించటం కష్టమని!''

''నేనేమీ రాక్షసుడిని కాదు నిన్ను పీక్కు తినేందుకు!''

''అలా అని నువ్వనుకుంటున్నావేమోగాని నేననుకోవటంలేదులే!''

''ఏం కూశావ్ ?''

''నేనేమీ గాడిదనుకాదు కుయ్యటానికి! మాటలు కాస్త జాగ్రత్తగా వాడటం యిద్దరికీ మంచిది. నాకేమీ గతిలేక మీ ఇంటికి రాలేదు. ఆస్తిపాస్తులకంటే పరువే ధనంగా; మర్యాదే ఉన్నత కుటుంబీకుల లక్షణమని మా అమ్మ ఎప్పుడూ చెప్పేది. ఆ లక్షణాలతో పుణికిపుచ్చుకుని సరయిన శిక్షణలో పుట్టి పెరిగాను. నువ్వన్నట్టల్లా పడివుండే అగత్యం నాకేమీలేదు!''

విసురుగా తన గదిలోకి వచ్చింది విజయ. ఎప్పుడూ అంత కోపంగా మాట్లాడియెరుగని విజయ ఆరోజు కోపాన్ని ఆపుకోలేకపోయింది. బాయ్‌ఫ్రెండా ? అనడిగేటప్పటికి!

మేరీ విషయం శ్రీనివాస్‌కి చెప్పకుండా వుండటమే మంచిదనిపించిందిగాని ఆ తరువాత తెలిస్తే ఏం గొడవ చేస్తాడో ? ఏం చేసినా తాను ధైర్యంగా ఎదుర్కోవటం మినహా ప్రస్తుతం మరో దారి లేదు తనకి. ఇలా యెంతమంది



హైదరాబాద్‌లో వేంకటేశ్వరుణ్ణి చూడటానికి వెళ్తున్న ''నన్''లు

మేరీలు శ్రీనివాస్ బలహీనతలను ఆధారం చేసుకుని తమచుట్టూ తిప్పుకుంటున్నారో ?

విజయ లోపలికి వెళ్లగానే శ్రీనివాస్ మేడమీద తన గదిలోకి వెళ్లబోయి తిరిగి తోటలోకి వెళ్లి మూలగా కూర్చున్నాడు.

విజయ! ఎంత పొగరుగా మాట్లాడుతుందో? అనుకోకుండా వుండలేకపోతున్నాడు. పైకి విజయను ఎంత ద్వేషించుతున్నా ఒకప్రక్క విజయ అంటే ప్రేమ కలుగుతోంది శ్రీనివాస్‌కి. చారడేసి కళ్లు కోటేరులాంటి ముక్కు — ''నువ్వెంత'' అనగానే ఆత్మస్థైర్యం! తనని ఆకర్షించుకో టానికి బదులు అనుక్షణం ఛీత్కరించుతుంటే శ్రీనివాస్‌లోని మరో పురుషుడు బుస్సుమంటూ అంతెత్తునలేచి అతన్నే ప్రశ్నించసాగింది.

''నీకోసం ఎంతోమంది ఆడపిల్లలు పడిగాపులుపడి ఛస్తున్నారు. ఇదేమన్నా ఆకాశంలో నుంచి ఊడిపడిన దేవతా ? నిన్ను ఛీత్కరించ టానికి!''

పళ్లు నూరుకున్నాడు. అసలు విజయ వచ్చినప్పటినుంచీ ఆ యింటి పద్ధతులే పూర్తిగా మారిపోయాయి. తల్లిదండ్రులేకాదు అన్నగారు కూడా విజయను ఎంతో ప్రేమించుతున్నారు. ఏదో ఒక టైంలో తండ్రి తనతో మాట్లాడేవారు. తనకి గాయాలు తగిలినాసరే! మాట్లాడటమే మానివేశారు. తనమీద తండ్రి కేమని చెప్పేదో ? అందుకే తను తోటలో విశ్రాంతికని వుంటున్న తల్లితండ్రులను చూసేందుకు వెళ్లలేదు. తల్లి సరేసరి! ప్రతి మాటకీ విజయ సలహా తీసుకోవటం; విజయ మాటకే అందరూ విలువ నివ్వటం; తన ఇంట్లో తనవాళ్ళల్లో తనకే విలువ లేకపోవటం! ఆ విజయ ఇక్కడనుంచి కదలదిక! పూర్తిగా ఈ యింట్లోనే తిష్టవేసుకుంది. ఎలా ఈ ఇంటిలోనుంచి బైటికి పంపాలి!...



కొండమీద వేంకటేశ్వరుణ్ణి దర్శనం చేసుకుని వెళ్లిపోతున్న విదేశీ అమ్మాయి [—శ్రీధర్]

ఎలా ? ? తీవ్రాలోచనలో పడిపోయాడు శ్రీనివాస్. విజయ అంటే అంతులేని ద్వేషం ఏర్పడింది. తన తల్లికి తండ్రికి ప్రీతిపాత్రురాలయిపోయింది.

తనను అనుక్షణం ద్వేషించుతున్న ఈ విజయను ద్వేషించచెయ్యాలి! అప్పటికిగాని తన కోపం చల్లారదు. ఎంత చతురులు కాకపోతే ఈ ఇంటి పెత్తనం తను తీసుకుంటుందా ? నా డబ్బుని తన చేతో్త యిస్తుందా ? అనాధను తీసుకొచ్చి పట్టంకట్టి ఈ ఇంటి పరిపాలనా బాధ్యతలు అప్పచెప్పి తనను ఫూల్ చేస్తారా ? అదే ! !... తేల్చుకోవాలి!

ఎంత ద్వేషంగానయితే విజయను గురించి ఆలోచించుతున్నాడో అంతకంతకూ విజయను చూస్తుంటే ఏదో బంధం తామిద్దరిమధ్యా వుందని; ఆ బంధమే విజయ బుజంమీద చెయ్యి వెయ్యటానికి తానెంత భయపడుతున్నాడో ? అదే మేరీలాంటి ఆడపిల్లనయితే రోజుకో అమ్మాయిని డబ్బిచ్చి కొనుక్కుని కోరిక తీరగానే చిరిగిన చీరను తీసేసినట్లుగా విసిరి అవతల పడవేసి వుండేవాడు.

విజయ కళ్ళల్లోని తీక్షణత శ్రీనివాస్‌ని దూరంగా వుంచుతోంది. తన చెయ్యికి గాయాలయినప్పుడు ఎంతో సేవ చేసింది. కనీసం కృతజ్ఞత కూడా చెప్పకుండా; కూడూ గుడ్డా యిచ్చి పని చేయించుకునే దాసీదాన్నిలాగ అనుక్షణం విదిలించుతునే వుండేవాడు... కాని... తనలోని ద్వేషాన్ని చిరాకుగా భావించి చిరునవ్వే సమాధానం చెప్పేది.

ఆ చిరునవ్వుని చూస్తుంటే చాచి చెంపమీద కొట్టాలనుకునేవాడు. అసలు విజయను తాకటానికే భయపడేవాడు చెంపమీద ఎలా కొట్టగలడు ?

ఇలా పరస్పర విరుద్ధ భావాలతో ఆలోచిస్తున్న శ్రీనివాస్‌కి వంటరిగా కూర్చోవాలన్నా యిబ్బందిగా వున్నది. బోరుగా ఫీలయ్యాడు. గేటు దగ్గిర ఆటోరిక్షా ఆగటం; అందులోనుంచి మేరీ దిగటం చూసి స్థాణువయిపోయాడు శ్రీనివాస్.

"నువ్విలా మా ఇంటికి రావటం బాగోదని" సమ్మె విషయం మాట్లాడటానికి వచ్చినప్పుడే మేరీకి చెప్పాడు. ఆ తరువాత మేరీ వచ్చినప్పుడు యింట్లో ఎవరూ లేకపోబట్టి ఏమీ అనలేక తన అవసరం తీర్చుకున్నాడు. ఎవరూ లేరని తెలుసుకున్న మేరీ విజయ కాలేజీకి వెళ్లిన తరువాత వచ్చేది. రావద్దని చెప్పగలిగే ధైర్యం శ్రీనివాస్‌కి లేకపోయేది. బలహీనమయిన కోర్కెలు శ్రీనివాస్‌ని మరింత బలహీనుడిని చేసేవి!

అప్పుడనుకుంది మేరీ !

"శ్రీనివాస్ తన విషయంలో చాలా దుర్బల మనస్తత్వం గలవాడని!" ఆ బలహీనతను ఆధారం చేసుకుని ఆతన్నొక ఆట ఆడించాలనుకుందిగాని లక్షలు సంపాదించి విపరీతమయిన పలుకుబడిని సంపాదించిన రామనాథం కొడుకు అని కళ్లారా చూసిన మేరీకి ఏదో ఒక వంకతో ఆ ఇంటికి రాకపోకలు సాగించింది.

శ్రీనివాస్ తొందర తొందరగా ఎదురువెళ్ళినా అంతకంటే తొందరగా లోపలికి వెళ్లింది మేరీ ! విజయ ఇంట్లోనే వున్నది. మేరిని లోగడ ఒకసారి చూసి ఏవగించుకుంది. ఇప్పుడు చూస్తే ముఖాన్నే ఎక్కడ అడిగేస్తుందోనని శ్రీనివాస్ భయం. అతన్ని చూసి మేరీ మాట్లాడబోయింది. ఛప్పున ఆమె నోరు మూసి తోటలోకి బలవంతంగా లాక్కువెళ్లాడు.

శ్రీనివాస్ అలా చెయ్యటం మేరీకి అసహనంగా వుంది. ఒకవేళ వాళ్ల నాన్నగారు వున్నారేమోనని భయపడింది.

"ఏమిటిది ?" నోటిమీద వున్న శ్రీనివాస్ చేతులను పట్టుకుని గుంజుతూ అడిగింది.

మేరీ మాట వినిపించి పువ్వులు కోసుకుంటున్న విజయ కొయ్యటం ఆపి చెవులు రిక్కించి వినసాగింది.

"నువ్విలా ఇంటికి రాకూడదని లక్షసార్లు చెప్పాను. మరలా చెప్తున్నాను. మరోసారి ఇలా వస్తే నీ మర్యాదదక్కదు !" కోపంగా అన్నాడు శ్రీనివాస్ !

"ఏ ? ... ఎందుకని ? నువ్వు యెక్కడికి పిలిస్తే అక్కడికి నేను రాలేదూ ? అలాగే ఇదీను ! వస్తే తప్పేమిటి ?"

'తప్పా ? తప్పన్నరా ? మరలా ఈ ఇంటి గుమ్మం ఎక్కకుండా కాళ్లు విరగ్గొడతాను !' అనుకుంది విజయ అసహ్యంగా !

"అది వేరు ! ఇది వేరు ! ఈ యింటికి నువ్వు వచ్చినప్పుడు మా విజయకి నువ్వన్నా నేనన్నా కోపం ! అప్పటినుంచీ నాతో మాట్లాడటం లేదు. మా విజయ మాట్లాడకపోతే నాకేమిటోగా వుంటుంది !"

"ఓ ! అదా సంగతి ? విజయ అంటే ఎవరేమిటి ? తాళి కట్టిన పెళ్లాం మాత్రం కాదుకందా ?"

"మా మామయ్య కూతురు. మా అమ్మకి నాన్నగారికి ఇష్టమయిన కోడలు ! మా ఇంటిలోనే వుండి చదువుకుంటోంది !"

మేరీ పెద్దగా నవ్వటంతో విజయ ఉలిక్కిపడింది. "తాళి కట్టిన పెళ్లాం కాదుకందా ?" అన్న మేరీ మాటకి తన మెడవంక చూసుకుంది. వంటిపేట గొలుసు మాత్రమే వుంది. తాళి అంటే ఇదికాదుగా ! రక్షించావ్ భగవాన్ ! అనుకుంది.

"మీ నాన్నగారు వున్నారేమోనని భయపడ్డాను. మేనకోడలంటే అంత భయం వున్నవాడివి బైట నువ్వు ఎంతమంది ఆడవాళ్లతో తిరగటంలేదు. వాటికి భయపడటంలేదే ?"

"అబ్బా ! నన్ను విసిగించకు మేరీ ! బైట వేసే వేషాలు ఇంట్లో వేస్తే చిప్పా కర్రా పుచ్చుకుని బైటికి వెళ్లవలసిందే ! మనిద్దరికీ అంతమంచిదికాదు నువ్విలా రావటం ! నీకిదే చివరిసారి చెప్పటం !"

"అకస్మాత్తుగా వైరాగ్యం పుట్టుకువచ్చిందేమిటి ?"

"మాటలకిది సమయంకాదు ! నువ్వు తొందరగా ఇక్కడనుంచి వెళ్లాలి ! మనం మరొకళ్ల దృష్టిలో చులకన కాకూడదని నా అభిప్రాయం !"

"అందుకేనా ? రెండుగంటలక్రితం ఫోన్ చేస్తే ఇంట్లో వుండికూడా లేదని చెప్పింది. ఆ మహాతల్లే చెప్పింది. నేను ఫోన్ చేసినట్టు నీకేమీ చెప్పలేదా ?"

విజయ తడబడింది. తాను దేనినయితే దాచివుంచిందో అదే వెల్లడి అయిందని; శ్రీనివాస్ కోపం సంగతి తెలియనిదికాదు ! అతను అడిగితే తనేమని జవాబు చెప్పాలో ఆలోచించుకోసాగింది.

"అయితే నువ్వేనన్నమాట ఫోన్ చేసింది. విజయని అడిగితే తన గర్ల్‌ఫ్రండ్ అని చెప్పింది!" సాలోచనగా అన్నాడు.

"నీకెందుకు చెప్తుంది ? నువ్వంటే లెక్కవుంది కనుకనా ? నువ్వే ఆమెకు భయపడతావు !"

మేరీ హేళనకు శ్రీనివాస్‌కి కోపంవచ్చింది. గట్టిగా మాట్లాడితే ఇంట్లోకి వినిపించుతాయేమోనని; ఆ తరువాత విజయ అడిగే యక్ష ప్రశ్నలకు తాను సమాధానం చెప్పకోలేడు. ఏమనలేక లోపల్లోపలే కోపాన్ని దిగమింగుకున్నాడు.

"ఇలా రావటం నాకూ బాగోని మాట నిజం ! కాని అవసరం నన్నిలా నీదగ్గిరకు రప్పించింది నువ్వు రాకపోయేసరికి ! నాకిప్పుడు అయిదువందలు కావాలి ! హాస్టల్ ఫీజు కట్టకపోతే వార్డెన్ వెళ్లగొట్టుతుంది. మకాం నీ ఇంటిలోనే పెట్టాల్సి వస్తుంది !"

"ఆ పని మాత్రం చెయ్యకు మేరీ ! నీకు కావలసిన ఆ అయిదువందలూ నీకిస్తానుగాని ! ఇక్కడే వుండు !"

అని శ్రీనివాస్ లోపలికి వెళ్లాడు. అతనలా వెళ్లటంతో గర్వంగా ఠీవిగా నవ్వుకుంది మేరీ !

[34వ పేజీ చూడండి]

### శ్రీ సాంధి స్టూడియోస్ చిత్రం

కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో ఈస్ట్‌మన్ కలర్‌లో తయారయ్యే చిత్రంలో కృష్ణ, జయచిత్ర, చంద్రకళ, శ్రీప్రియ, అంజలీదేవి, రజనీకాంత్, చలం, కన్నడ నటుడు ప్రభాకర్, అల్లు రామలింగయ్య వగైరా నటవర్గం. కన్నడంలో విజయవంతమైన 'సహోదరర సవాల్' ఆధరంగా తయారౌతూన్న ఈ చిత్రానికి సంగీతం : సత్యం. ఛాయ : ఎస్. ఎస్. లాల్.

### కామెర్లకు కృష్ణంరాజు దివ్యౌషధం!

సుక్షత్రియ వంశానికి చెందిన **హీరో** కృష్ణంరాజుకి వారి స్వగ్రామంలో పెద్ద పేలెస్ వుంది. ఆయన బాల్యంలో జరిగిన ఓ సంఘటన... ఓ వాస్తు శిల్పి "ఈ తలుపు ఆ వైపున వుంటే మంచిది. బావిని ఫలానా దిక్కులో తవ్వించండి" అంటూంటే కృష్ణంరాజుకి ఆ వాస్తు శిల్పాన్ని పూర్తిగా తరచి చూడాలనిపించింది. ఎన్నెన్నో గ్రంథాలు తెప్పించి చదివారు. "అనుభవంకొద్దీ మన పూర్వీకులు రూపొందించిన సిద్ధాంతాలన్నీ ఆచరణయోగ్యమైనవి" అంటారాయన. వాస్తు శాస్త్రం గురించి సలహాలివ్వడమేకాక "పచ్చ కామెర్ల" వ్యాధికి కూడా కృష్ణంరాజు ఒక దివ్యౌషధాన్ని యిస్తూంటారు. "ఈ ఔషధ రహస్యం మా పూర్వీకులనించి నాకు సంక్రమించింది," అన్నారాయన. కృష్ణంరాజు బి.కామ్ చదివాక "ఆంధ్రరత్న" అనే దినపత్రికను కొంత కాలం నడిపారు. దానిని వారి పినతండ్రి, లోగడ ఆంధ్రరాష్ట్ర అమాత్య శేఖరులు మూర్తిరాజుగారు నిర్వహించేవారు.

★ "నే చూసిన తొలి చిత్రం సాధనావారి 'సంసారం'. అందులోని 'టక్కు టక్కు టముకులబండి' అనే హిట్ సాంగ్ చాలా కాలం వరకు నా నోట్లో మెదలుతూండేది" అన్నారు డైరెక్టర్ దాసరి నారాయణరావు — తమాషా ఏమిటంటే ఆ పాట చిత్రీకరణలో పాల్గొన్న ఎ. ఎన్. ఆర్., సావిత్రి యిప్పుడు ఆయన దర్శకత్వం వహిస్తూన్న "దేవదాసు మళ్ళీ పుట్టాడు" చిత్రంలో కలిసి నటించడం.

★ ఎం. జి. ఆర్. నటించిన ప్రతి చిత్రం శతదినోత్సవాలను తమిళనాడులోని ఆయన అభిమాన సంఘాలవారు ఎంతో ఘనంగా జరుపుకునేవారు. ఇప్పుడాయన చిత్రాలలో నటించడం మానేశాక వాళ్ళకా వేడుక మరో రూపంలో కలిసి వచ్చింది. తమిళనాడు ముఖ్యమంత్రిగా ఆయన నూరు రోజులు పూర్తిచేసిన సందర్భంలో ఆ అభిమాన సంఘాలవారు శతదినోత్సవాన్ని జరుపుకున్నారు.

★ మద్రాసులో "సిరి సిరి మువ్వ" చిత్రం తమిళుల్ని విశేషంగా ఆకర్షించడం చూసిన ఓ తమిళ నిర్మాత తను నిర్మించబోయే తమిళ చిత్రం పేరు "సిరి సిరి మామా" అని ప్రకటించాడు. తమిళంలో 'సిరి' అంటే 'నవ్వు' అని అర్థం. అంచేత 'నవ్వు నవ్వు మామా' అని ఆ చిత్రం పేరన్న మాట.



పైన : 'ఆమెకథ'లో రజనీకాంత్, జయసుధ

## జి. వి. జి. పేజీ

★ "గుహనాథన్ చక్కని కథ యిచ్చారు. ట్రీట్‌మెంట్ యింకా బాగా తయారైంది. జనవరి 20 న షూటింగ్ ప్రారంభం", అన్నారు అన్నపూర్ణా స్టూడియోస్ అండ్ జగపతి ఆర్ట్ పిక్చర్స్ పతాకం కింద సినిమాస్కోప్‌లో తయారయ్యే "రామకృష్ణులు" చిత్రానికి దర్శకత్వం వహించే నిర్మాత వి. బి. రాజేంద్ర ప్రసాద్. ఎన్. టి. ఆర్., ఎ. ఎన్. ఆర్. పక్కన జయసుధ, జయప్రద పాల్గొంటారు. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల, రామకృష్ణ పాడే ఎనిమిది పాటలు డిసెంబర్ 18—25 మధ్య రికార్డు చేయబడతాయి. మాటలు, పాటలు : ఆత్రేయ. సంగీతం : కె. వి. మహదేవన్. ఛాయ : వి. ఎస్. ఆర్. స్వామి. శిల్పం : ఎస్. కృష్ణారావు. నృత్యాలు : హీరాలాల్. కూర్పు : ఎ. సంజీవి. భారీయెత్తున అన్నపూర్ణ స్టుడియోలో తయారయ్యే ఈ చిత్రం జూన్‌లో విడుదల.

★ "మా సాహస వీర శృంగార హాస్యరస ప్రధానమైన జానపద వర్ణ చిత్రానికి సహజమైన రాజకోటలలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోని కీకారణ్యాల లోనూ భారీ సెట్టింగులు వేసి నిర్మించేందుకు ఆంధ్రప్రదేశ్, మైసూర్, రాజస్థాన్‌లలో లొకేషన్స్ చూడ్డానికి వెళ్తున్నాం", అన్నారు తిరుపతి ప్రొడక్షన్స్ పతాకంలో ఎన్. టి. ఆర్., వాణిశ్రీ, సత్యనారాయణ, రావుగోపాలరావు ప్రభృతులతో సినిమాస్కోప్ వర్ణ చిత్రాన్ని కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించే దాట్ల శ్రీరంగరాజు. డాక్టర్ డి. వి. ఎస్. రాజు నిర్మించే ఈ చిత్రానికి ఫిబ్రవరిలో పాటలు రికార్డు చేయబడతాయి. జూన్‌లో షూటింగ్ పూర్తిచేసుకొని, వచ్చే సెప్టెంబర్‌లో విడుదలవుతుంది. పెక్కుమంది దృఢకాయులు, మరుగుజ్జులతోపాటు వందలాది అరబ్బీ గుర్రాలు, ఒంటెలు, వేలాది జూనియర్ కళాకారులు ఈ చిత్రంలో పాల్గొనడం మరో విశేషం. రచన : డి. వి. నరసరాజు. సంగీతం : ఎం. ఎస్. విశ్వనాథన్. ఛాయ : కన్నప్ప. కూర్పు : మార్తాండ్. శిల్పం : భాస్కరరాజు. నిర్మాణ పర్యవేక్షణ : దాట్ల బలరామరాజు, ఆర్. విజయ రామరాజు.

★ "మెహబూబ్‌నగర్‌లోని పిల్లలమర్రి వద్ద, దానికి సమీపాన వున్న మన్యం కొండవద్దా కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రీకరించాం. హొగెనకల్‌లో క్లయిమాక్స్ చిత్రీకరించడంతో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు సురేష్ ఎంటర్‌ప్రైజెస్ వారి "మొరటోడు" చిత్రాన్ని సమర్పించే డి. రామానాయుడు. ఆయన పుత్రులు డి. సురేష్ బాబు, డి. వెంకటేశ్‌బాబు నిర్మించే ఈ చిత్రానికి హాస్యనటుడు నాగేష్ తొలిసారిగా కథ, దర్శకత్వం నిర్వహిస్తున్నారు. సత్యనారాయణ, జయసుధ, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, ప్రభాకర రెడ్డి, రాజ్‌బాబు, మోహన్‌బాబు, సాక్షిరంగారావు, సుధ, బేబీ రోహిణి, నాగేష్ పాత్రధారులు. మాటలు : మోదుకూరి జాన్సన్. సంగీతం : ఎం. ఎస్. విశ్వనాధం. ఛాయ : వెంకట్. శిల్పం : రాజేంద్రకుమార్. కూర్పు : మార్తాండ్. డిసెంబర్ విడుదల.

★ "మా సంపూర్ణ హాస్యరసప్రధాన చిత్రానికి డైరెక్టర్ కె. ప్రత్యగాత్మగారి వద్ద చాలాకాలం సహకార దర్శకుడుగా పని చేసిన కట్టా సుబ్బారావును దర్శకునిగా ఎన్నుకున్నాం", అన్నారు విష్ణుప్రియ ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో "వియ్యాలవారి కయ్యాలు" చిత్రాన్ని నిర్మించే జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి. కృష్ణ, జయప్రద నాయకా నాయికలు. రచన : జంధ్యాల. సంగీతం : సత్యం. ఛాయ : వెంకట్.

### దొంగల దోపిడి

శ్రీ పద్మావతీ పిక్చర్స్ "దొంగల దోపిడి" సినిమాస్కోప్ వర్ణ చిత్రం షూటింగ్ డిసెంబర్ నించి ప్రారంభం. దాదాపు వంద సంవత్సరాల క్రితం నాటి వాతావరణంలో తయారయ్యే ఈ యాక్షన్ పేక్‌డ్ చిత్రంలో కృష్ణ **హీరో**.

### పరిస్థితులు చక్కబడేదెప్పుడు?

అక్రమ పద్ధతులకు దారితీసిన జిల్లాలవారీ చిత్రాల అమ్మకం పద్ధతి వల్ల చలనచిత్ర పరిశ్రమలో ఓ విధమైన గిరాకీ వాతావరణం మాత్రం పెరిగిపోయిందేగాని, ఈ అనారోగ్యకరమైన వ్యాపార విధానం అంతరించకపోతే పరిశ్రమ మనుగడకే ముప్పు రావడం తథ్యమని పలువురి ఆందోళన. కాని, పంపిణీదారులు నిర్మాతలను శాసిస్తున్నారనీ, జిల్లాలవారీ చిత్రాల అమ్మకంవల్ల చిత్రం విడుదలకు ముందు నిర్మాత కొంత డబ్బయినా కళ్ళచూడటం జరుగుతున్నదనీ మరొక వర్గం వాదన. ఈ పరిస్థితులు చక్కబడేదెప్పుడు? పరిశ్రమ మనుగడ సమస్య వచ్చినప్పుడు ఇలాంటి సమస్యలను పరిష్కరించవలసిన బాధ్యత అందరిమీదా వుంది.

కో-ఆప్టెక్స్ తమ కొత్త శ్రేణికిచెందిన అపూర్వమైన చీరలను
ధరించందుకు వయసులో ఉన్న ఆకర్షణీయమైన
యువతులకోసం ఎదురుచూస్తున్నారు

# ఆ! మీలాంటి యువతులకోసమే



కో-ఆప్టెక్స్ శ్రేణి సాటిలేని సృష్టి. కాటన్, పోలియెస్టర్, సిల్క్ బట్టలు చిరకాలమన్నేవి. ముదురురంగులవి.
రకరకాల ధరలుగలవి. ఓహ్ అద్భుతం. అచ్చం మీలాంటి అమ్మాయిలకోసమే మరి.

Co-optex

Rediffusion C/610 F TL

# ★ సినిమా విశేషాలు ★

## రాజధానిలో ఎక్కువ చిత్రాలు

1977–'78 సంవత్సరాలలో తెలుగు చిత్రాల నిర్మాణం అధికంగా వుండగలదని, 1976 చిత్రాలను సమీక్షిస్తూ వ్రాశాను. అదే వ్యాసంలో రాజధానీ నగరం మరింత యాక్టివ్‌గా వుండగలదని వూహించాను.

ఇప్పుడున్న పరిస్థితిని చూస్తే... భాగ్య నగరంలోనే రోజూ షూటింగు జరుగుతుందేమో అనిపిస్తుంది.



'చిలిపి కృష్ణుడు'లో వాణిశ్రీ

మదరాసులోని స్టుడియోలకు వెళ్తున్నప్పుడు, అరుదుగా తెలుగు చిత్రం తాలుకు షూటింగు అగుపిస్తూంది.

అగ్రనాయకులతోబాటు, వారి చిత్రాలలో పాల్గొనే ప్రతి కళాకారుడు నెలకు యిరవై రోజులు రాజధానీ నగరంలో కాపురం చేయడం జరుగుతూవుంది. నిర్మాణం అవుతున్న అరవై తెలుగు చిత్రాలలో, సగానికిపైగా హైద్రాబాద్ స్టుడియోలలో నిర్మాణం కావడం ముదావహం.

రాజధానీనగరంలో తెలుగు చిత్రాలేగాక... తమిళ... కేరళ భాషా చిత్రాలు కూడా తయారు కావడం శుభావహం.

ఇప్పుడున్న సారధీ... అన్నపూర్ణా... శ్రీ రామకృష్ణ... భాగ్యనగర్ స్టుడియోలకు సరిపడేందుకు, మన నిర్మాతలు మరింత స్వదేశాభిమానాన్ని ప్రదర్శించాలి.

### ప్రభుత్వం చెయ్యాల్సిన సౌకర్యం

మదరాసునుండి మన నగరానికి వచ్చే చిత్రరంగ వ్యక్తులకు భోజన... వసతి గృహాలను ఏర్పాటు చెయ్యాలి. ఇవ్వవలసిన లక్ష సబ్సిడిని రిలీజుకు ముందురోజే నిర్మాతకు అందే ఏర్పాటు చెయ్యాలి.

బహిరంగ ప్రసంగాలతో సరిపెట్టుకోక, సినిమావాళ్లకు పనికొచ్చే కార్యక్రమాలను త్వరితగతిని నిర్వహించాలి.

ఏది ఎలా వున్నా... ఒక్క నిజాన్ని ఎవ్వరూ కాదనలేరు. మన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు సినిమా రంగ ప్రగతికి చాలావరకు సహకరిస్తున్నారు. ఇంతకుముందెన్నడూ కానరాని విజృంభణ రాజధానీ నగరంలో జరగడం... శుభ భవిష్యత్తుకు నిదర్శనంగా పేర్కొనవచ్చు.

### జరుగుతున్న చిత్రాలు

హైద్రాబాద్ స్టుడియోలలో ప్రస్తుతం జరుగుతున్న చిత్రాలు ఎన్ని?

శ్రీ నాగేశ్వరరావు నటిస్తున్న "చిలిపి కృష్ణుడు... దేవదాసు మళ్లీ పుట్టాడు" శ్రీ రామారావు నటిస్తున్న "అక్బర్... సలీం... అనార్కలి... మేలుకొలుపు... శ్రీరామ పట్టాభిషేకం" శ్రీ కృష్ణ పాల్గొంటున్న సారధీ స్టుడియోస్ చిత్రం, శ్రీ శోభన్ నటిస్తున్న "మంచి బాబాయ్" చిత్రాలుగాక "డూ డూ బసవన్న" "సూర్యచంద్రులు... మొరటోడు" బాలచందర్‌గారి చిత్రాలు, భాగ్యనగర్ స్టుడియోస్ వారి చిత్రం. ఇవిగాక, నవంబర్... డిశంబర్ నెలల్లో మరో పది కొత్త చిత్రాలు భాగ్యనగరంలోని స్టుడియోలలో ప్రారంభం కాబోతున్నాయి.

### హైద్రాబాద్ టు ఊటీ

అక్టోబర్ 14 నుంచి, వరుసగా పక్షం



రోజులు హైద్రాబాదులో "మంచి బాబాయ్" షూటింగులో పాల్గొని అక్టోబర్ చివరి రోజున చెన్నపురికి వచ్చిన శోభన్‌బాబు, నవంబర్ మొదటి రోజున ఊటీకి వెళ్లారు. ఎందుకో తెలుసా?

ప్రముఖ చిత్ర నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు "అవార్డు దర్శకుడు" శ్రీ విశ్వనాథ్ దర్శకత్వంలో రూపొందిస్తున్న కొత్తతరహా చిత్రానికిగాను, నవంబర్‌లో మొదటి పధ్నాలుగు రోజులు ఊటీలో షూటింగు నిశ్చయించారు.

ఊటీ షూటింగులో పాల్గొనడానికై శోభన్‌బాబు, జయసుధ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్యగార్లు కాల్‌షీట్లు యిచ్చారు. ఈ షెడ్యూలుతో ఆరు రీళ్ల చిత్రం వస్తుంది, అన్నారు నిర్మాత డి. వి. ఎస్. రాజుగారు. ఈ వర్ణ చిత్రంలో సత్యనారాయణ, మాధవి, భీమరాజు ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

### జయప్రద విదేశీ చిత్రాలు

"స్వప్నసుందరి" అని ప్రేక్షకులచేత పిలవబడుతున్న అందాల అతివ జయప్రద చెన్నపురి, భాగ్యనగరం చిత్రాలలోనేగాక బొంబాయి చిత్రంలో కూడా నటించగలదని పాఠకులకు రెండువారాల క్రితం తెలిపాను.

ఈ వారం మరో కొత్త వార్తను జయప్రద బ్రదర్ శ్రీ రాజబాబు ఈ విలేఖరికి చెప్పాడు. అదేమిటంటే.

ఒక ప్రముఖ తమిళ చిత్ర నిర్మాత తెలుగులో నిర్మించనున్న రెండు భారీ వర్ణ చిత్రాలను సింగపూర్‌లో తలపెట్టినట్లు, ఆ రెండింటిలో జయప్రద ముఖ్య నటిగా నటించనున్నట్లు, శ్రీ బాలచందర్ దర్శకత్వం నిర్వహించనున్నట్లు తెలిపారు.

జయప్రదకు వున్న యిమేజ్‌ను మరొకరు యిమేజిన్ చెయ్యగలరా?



నవంబరు 6వ న్యూఢిల్లీలోని విజ్ఞాన భవన్‌లో జరిగిన అవార్డు ప్రదానోత్సవంలో రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి జాతీయ అవార్డులని ప్రదానం చేశారు. ఉత్తమ నటుడి బహుమతి అందుకున్న శ్రీ మిధున్ చక్రవర్తిని, ఉత్తమనటి బహుమతి నందుకున్న శ్రీమతి లక్ష్మిని చిత్రంలో చూడవచ్చు.

## దేవదాసుపై ఏర్పడిన మోజు

శ్రీ అక్కినేని దేవదాసుగా, వాణిశ్రీ... పావిత్రి. జయప్రద నాయిక పాత్రధారులుగా అగ్రదర్శకుడు శ్రీ దాసరి రూపొందిస్తున్న రంగుల వైభవం ''దేవదాసు మళ్ళీ పుట్టాడు'' చిత్రానికి వస్తున్న బిజినెస్ ఆఫర్లు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.

నవంబర్‌లో జరిగే మూడో షెడ్యూలుతో చిత్రం దాదాపు పూర్తయ్యే ఘట్టాన్ని చేరుకుంది.

ప్రేక్షకులు పెంచుకున్న ఆశలకు అనుగుణంగా ''దేవదాసు మళ్ళీ పుట్టాడు'' చిత్రాన్ని రూపొందించడానికి అక్కినేని... దాసరిగార్లు అత్యంత జాగ్రత్త తీసుకుంటున్నారు.

శ్రీ రాజేశ్వరరావు సమకూర్చిన బాణీలను విన్నవారందరూ ఆయన మేధస్సును ప్రశంసిస్తున్నారు. ప్రతి పాటలో జీవం... నాదం వున్నది గాబట్టి, అన్ని పాటలు అందరినీ ఆకట్టుకోగలవు.

ఈ చిత్రాన్ని ఒక మధుర మనోహర లావణ్యవతిగా తీర్చిదిద్దుతున్న శ్రీ దాసరిని మన ప్రేక్షకులు నిండుహృదయంతో ఆశీర్వదించగలరు.

## సినిమా

దేవదాసుగా శ్రీ నాగేశ్వరరావు అపూర్వంగా, అద్వితీయంగా నటిస్తున్నారని, వాణిశ్రీ, సావిత్రి గార్లతో ఆయన నటించిన సన్నివేశాలు చిత్రంలో ప్రత్యేకమైన ప్రశంసలకు గురికాగలవని, దర్శక.. కథకుడు శ్రీ దాసరి వివరించారు.

శరత్ దేవదాసు, దాసరిగారి ''మళ్లీ పుట్టాడు'' ఒకటేనా అని కొందరికి వస్తున్న సంశయాన్ని ఆయనకు తెలిపాను రెండూ ఒకటయితే మళ్లీ నిర్మించడం దేనికి అని ఆయన ఎదురు ప్రశ్న వేశారు.

చిత్రం విడుదలయ్యేంతవరకు తన కథనుగాని, కథలోని పాత్రల స్వభావాన్నిగాని తెలిపితే, ప్రేక్షకులు ఏర్పరచుకున్న ''థ్రిల్''కు అవకాశం వుండదు, అన్నారు శ్రీ దాసరి

ఒక మంచి చిత్రాన్ని రూపొందించడానికి బాధ్యత వహిస్తున్న నిర్మాత త్రయం వెంకటేషప్ప, పాండురంగప్ప, శ్రీనివాస్ గార్లను ''ప్రజా దర్శకుడు'' శ్రీ దాసరి అభినందించారు.

''డిశంబర్‌లో జరిగే అవుట్ డోర్ షెడ్యూలుతో చిత్రం పూర్తవుతుంది'' అన్నారు శ్రీ నారాయణరావు.

---

మనసులు,మనుషులు కలిస్తేనే తొలిరేయి.
కానీ మధ్య అడ్డుతెర పడిందా? అంతే!
మలిరేయి..మలిరేయి..మామూలు రేయే!



తప్పక చూడండి!

Srujana సృజన కంబైన్స్





తొలిరేయి గడిచింది

నిర్మాత:M.గోపాలకృష్ణారెడ్డి దర్శకత్వం:K.S.రామిరెడ్డి B.Sc.,D.C.,
సంగీతం: సత్యం మాటలు: గణేష్‌పాత్రో కూర్పు: M.S.మణి కళ: భాస్కరరాజు
స్టిల్స్:M.D.సుందర్ కెమెరా:K.రామచంద్రబాబు

పూర్ణా రిలీజ్

NAVRANG




---

చక్కనికథ...మంచివినోదంగల
రంగుల వైభవం!

శ్రీరామకృష్ణా ఆర్ట్స్

గడుసు పిల్లోడు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: ఎం.రామకృష్ణారెడ్డి
దర్శకత్వం కె.బాపయ్య
డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ ఏ విన్సెంట్
సంగీతం కె వి మహదేవన్

తారకరామ
నటేష్ ఫిలిమ్ ఎక్స్ఛేంజ్
శ్రీ తారకరామ

THARAKARAMA

'చరిత్రహీనులు'లో రావు గోపాలరావు, ప్రభ

# "ప్రేక్షకులు సినిమా చూసేవరకే పత్రికలు"

## —రాజేంద్రప్రసాద్ జవాబు

"అన్నపూర్ణ" చిత్రంతో తెలుగు సినీ రంగాన్ని ప్రవేశించిన శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్, వరుసగా జనరంజకమయ్యే వెరైటీ చిత్రాలను నిర్మించి, ప్రేక్షకుల అభిమానాన్ని ఆర్జించారు

జగపతి సంస్థ నిర్మించే చిత్రమంటే, ఆదినుంచి ఆ చిత్రంపై ఎన్నెన్నో ఆశలు పెంచుకోవడం మన ప్రేక్షకులకు పరిపాటి

ఈతూరి శ్రీ రాజేంద్రప్రసాద్ సినిమాస్కోప్ వర్ణచిత్రాన్ని తలపెట్టడం, ఆ చిత్రంలో యిద్దరు "సూపర్‌స్టార్స్" ప్రధాన పాత్రధారులు గావడం. జనంలో నూతనోత్సాహాన్ని ఏర్పరచింది

"రామకృష్ణులు" అనేడి పేరు తన చిత్రానికి ఎలా సమంజసమైనదో, ఆయన న్యేజరిపిన యింటర్‌వ్యూలో వివరించారు

జగపతి అధినేత చెప్పిన యితర విశేషాలను పాఠకులకు తెలుపుతున్నాను

ప్ర: సినిమాస్కోప్ నిర్మాణం వలన ప్రత్యేకమైన ఫలితం ఏదయినా వున్నదా?

జ: కొద్ది సంవత్సరాల క్రితం కలర్ చిత్రాలు చాలా తక్కువ సంఖ్యలో నిర్మించేప్పుడు కలర్ క్రేజ్ వల్ల ఏదైనా అధిక ప్రయోజనం వుందాని చాలామంది అడిగారు. మరిప్పుడు కలర్ క్రేజ్ పెరిగిపోయింది. అలాగే యిప్పుడు సినిమా స్కోప్‌ని గురించి అడుగుతున్నారు. ఎంతో కొంత అధిక ఫలితం లేకపోలేదు. ఆ ఫలితమే లేకపోతే ఎక్కువ వెచ్చించి నిర్మాత లెందుకు నిర్మిస్తారు కాని నేను సినిమా స్కోప్ తీసేది అదేదీ దృష్టిలో పెట్టుకుని కాదు ప్రేక్షకుల దృష్టిలో జగపతి బ్యానర్ ఆకాశాన్నంటుకుని వుంది. ఎన్ని విధాల ప్రయత్నించినా ప్రేక్షకులు ఆశించే అవధులకు చేరలేకపోతున్నామేమోనని బాధగా వుంది అందు వలన మావల్ల చేతనయినంతవరకు కొత్తదనాన్ని చూపించి ప్రేక్షకులను ఒప్పించాలన్న ప్రయత్న ఫలితమే సినిమాస్కోప్ చిత్ర నిర్మాణం



ప్ర: "రామకృష్ణులు" అంటే పౌరాణికమా?

జ: తల్లిదండ్రులు తమ బిడ్డలకు ఎందరో పురాణ పురుషుల పేర్లు పెడ్తారు. కారణం వాళ్ళు పురాణ పురుషులనికాదు అర్థం. ఆ రూపేణానైనా పురాణ పురుషుల్ని పదిసార్లు పలకొచ్చని అలా నామకరణం చేస్తారు 'రామకృష్ణులు' చిత్రంలో అవి కథా నాయకుల పేర్లు మాత్రమే! పురాణానికి సంబంధంలేదు — కథకు సంబంధముంది

ప్ర: "సూపర్ స్టార్స్"తో నిర్మించే చిత్రంలో యిద్దరు అభిమానులకు తృప్తినిచ్చే పాత్రలు వుంటాయా?

జ: ఇద్దరి అభిమాన నటుల అభిమానులు సంతృప్తి పొందాలనే సర్వ ప్రయత్నాలు చేస్తున్నాం

ఎవరికి అన్యాయం మాత్రం జరగదు. ఇద్దరూ ఒక మంచంలో పడుకుని ఒకే కంచంలో భోజనం చేసే ప్రాణ స్నేహితులు. ఒక రెక్కాడుంటే రెండోవారు అక్కడ వుండవలసిందే!

ప్ర: సినిమా విజయంలో సంగీతం శాతం ఎంత? పాటలు ఎలా చోటు చేసుకుంటాయి?

జ: చిత్రం విజయవంతం కావాలంటే అన్ని అంశాలు సమపాళ్లల్లో సమకూడాలి. కాని సంగీతానికి ప్రత్యేక స్థానం లేకపోలేదు. చిత్రాలలో సన్నివేశాన్నిబట్టి కొన్ని పాటలుంటాయి — పాటల కోసం కొన్ని సన్నివేశాలు సృష్టించటం కూడా జరుగుతుంది.

ప్ర: ప్రస్తుతం తెలుగు చిత్ర పరిశ్రమ ఎలా వుంది?

జ: ఇప్పటి సినిమా రంగ పరిస్థితి తెగిపోయిన గాలిపటం. ఈ వ్యయం ఈ నిర్మాణ పద్ధతులు యిలాగే సాగితే ఏదో ఒకనాడు ఈ గాలిపటం కూడా నేల కొరగటం ఖాయం.

ప్ర: హిందీ చిత్రాలు మనవాటికి యిబ్బంది కరమా?

జ: హిందీవారి భారీ నిర్మాణ ప్రభావం తట్టుకోలేక ఖర్చు చాలా ఎక్కువయినా చేసేది లేక వాళ్ల స్థాయికి దగ్గరగానయినా రావాలని ప్రయత్నిస్తున్నాం. ఆ ప్రయత్నమే లేకపోతే రాణీగారిని చూసిన కళ్లతో భార్యను చూసిన సామెతే మిగులుతుంది.

ప్ర: మీ చిత్రంలోని పాటలను ఎవరెవరిపై చిత్రీకరిస్తారు?

జ: ఈ చిత్రంలో వున్న ఎనిమిది పాటలు హీరో హీరోయిన్లపైనే చిత్రీకరించబడుతాయి. నాలుగు పాటల్లో నలుగురూ వుంటారు.

ప్ర: చలనచిత్ర అభివృద్ధికి ప్రభుత్వం ఏం చెయ్యాలి?

జ: ప్రభుత్వంవారు వారు చెయ్యకలిగిందంతా చేస్తున్నారు. కాని వారు చేసే సహాయం పెరిగిపోతున్న నిర్మాణ వ్యయానికి ఎక్కడా అంతు పట్టటంలేదు. 50 వేలతో సబ్సిడీ ప్రారంభించి ఒక లక్షదాకా పెంచారు. అది రెట్టింపయితే అక్కడ పెట్టవలసిన ఖర్చు నాలుగు రెట్లయింది. ఆంధ్ర రాష్ట్రంలో తెలుగు చలన చిత్ర పూర్తిగా నూటికి నూరుపాళ్లు స్థిరనివాస మేర్పరుచుకోవాలంటే ఆంధ్ర రాష్ట్రంలో నిర్మించే తెలుగు చిత్రాలకు మాత్రం వినోదపు పన్నులో కొంత శాతం సబ్సిడీగా యిస్తే అందర్నీ ఆకర్షించకలుగుతుంది.

ప్ర: మీ హిందీ చిత్ర నిర్మాణం ఎప్పుడు?

జ: హిందీ నిర్మాణానికి ఒకటి రెండుసార్లు ప్రయత్నించాను. కారణాంతరాలవల్ల ముందుకు పోలేకపోయాను. అన్నీ ఖాయమనుకున్న రోజున హిందీ వుందని చెప్పగలను.

ప్ర: చిత్రం విజయానికి అపజయానికి అభిమాన సంఘాలు ఎంతవరకుబాధ్యతవహిస్తాయి?

జ: జయాపజయాలు ఏ ఒక్కరివల్ల ఫలించలేవు. నిర్మించే చిత్రంలో అన్ని హంగులూ వుండాలి. ఏదీ లేనప్పుడు సంఘాలవారు ఎంత ప్రయత్నించినా ఎంత ఖర్చుచేసి ఎలాగయినా విజయవంతం చెయ్యాలని తాపత్రయపడినా ప్రయోజనం లేదు. కాని వారి అభిమాన నటులున్న చిత్రం విజయవంతం కాలేదంటే వారు చాలా బాధపడేమాట వాస్తవం. కానీ చిత్రంలో పట్టు లేనప్పుడు వారేం చేయగలరు? దాని తరవాత వచ్చే చిత్రమయినా విజయవంతం కావాలని మనసారా కోరుకుంటూ వుంటారు.

ప్ర: "బంగారు బొమ్మలు" హిందీలో నిర్మించే వుద్దేశ్యం గలదా?

జ: 'బంగారు బొమ్మలు' చాలా మంది అనుకునేదానికన్నా ఆర్థిక విజయం పొందినమాట వాస్తవం. కాని నేను వూహించిన స్థాయికి చేరని మాట వాస్తవమే! అందువల్లనే అది హిందీలో నిర్మించటం ప్రస్తుతం ఆపటం జరిగింది.

ప్ర: మీ సంస్థపై ప్రజలకు ఎక్కువ అభిమానం వుంది. కారణం?


'దేవతలారా దీవించండి'లో జయమాలిని

## సినిమా

జ : అది ఏ ఒక్కరి గొప్ప కాదు. సంస్థలో పనిచేసే ప్రతివారు దానికి బాధ్యులు. అదేకాకుండా నాలుగు డబ్బులు వచ్చిన రోజున నలుగురికి సహాయపడాలనేదీ ఆ సంస్థలోని వారందరికీ వుంది అదికూడా ఒక కారణమయి వుండవచ్చు. వారి కంత అభిమానముండటం కూడా కొంచెం యిబ్బందిగానే వుంది. కారణమేమంటే మన తెలుగునాడుకున్న కెపాసిటీని మించి వెచ్చించి వారిని మెప్పించాలని ప్రయత్నం చేస్తున్నా, వారు యింకా ఎక్కువ వూహించుకోవటంవలన వారు అనుకున్న స్థాయికి చేరలేకపోతున్నాం. రామకృష్ణుల చిత్రంతో అందర్ని సంతృప్తిపరచాలని సర్వ ప్రయత్నాలు చేస్తున్నాం. విజయవంతం కావటానికి మేం చేస్తున్న కృషికి ప్రజల ఆమోద ముద్ర పడాలని భగవంతుణ్ణే ప్రార్థిస్తున్నాం.

ప్ర : నేటి పత్రికల ప్రభావం చిత్రానికి ఎంతవరకు వుపయోగపడుతుంది ?

జ : ప్రేక్షకులు సినిమా చూసేంతవరకు.

—శ్రీనివాస్ ★

# డాక్టర్ సలహాలు

ఎ. ఎస్. ఆర్. — అనంతపూర్

నాకు ముఖముమీద, చెవుల దగ్గిర, ముక్కు మీద నల్లని మచ్చలు ఏర్పడినవి. రెండు చెవుల దగ్గర మచ్చలు మాత్రలు అప్పుడప్పుడూ దురదగా వుంటాయి. మిగతావి దురద వుండవు.

★ ఈ నల్లమచ్చలనేవి సాధారణంగా ఫంగస్ ఇన్‌ఫెక్షన్‌వల్ల ఏర్పడతాయి. ఈ ఫంగస్ అనే అతి సూక్ష్మక్రిములు వుంటేనే దురద ఏర్పడుతుంది.

ఈ లక్షణాలు వున్నవారు — లోనికి రోజుకి ఆరు మాత్రల వంతున క్రమంగా 20 రోజులు "గ్రైసోవిన్" మాత్రలు; పైపూతగా ప్రతినిత్యం రెండుపూటలా "ఎస్కామెల్" ఆయింట్‌మెంట్ గాని, అంగువెంటమ్ విట్ ఫీల్డ్ గాని వాడటం మంచిది. ఆహారంలో యెక్కువ క్రొవ్వుపదార్థాలు వాడటం మంచిదికాదు.

ఎఫ్. ఎ. ఆర్. — విస్సాకోడేరు

వక్కపొడి తినుటవలన ఆరోగ్యానికి హానికరమా? మరియు గాయకులు అది వాడవచ్చునా? లేదా? ఎందువలన?

★ వక్కపొడి వాడటం, తగు మోతాదులో అయితే శరీరానికి పెద్ద ప్రమాదంలేదు. పైగా మన కడుపులో వుండగల క్రిములను సంహరిస్తుందని నిరూపించబడింది.

అదేపనిగా వాడటంవల్ల దంతాలు పాడవటం జీర్ణమవటం ఆలస్యంకావటం జరుగవచ్చు.

గాయకులంటే — వారూ మనుష్యులేగా. వారికికూడా పైన చెప్పినవే వర్తిస్తాయి. పైగా చాలామంది పేరున్న గాయకులు వక్కపొడి వాడటం అందరికీ తెలిసిందేకదా! ఏదైనా మితిమించకుండా చూసుకుంటే ఏ రోగమూ రాదు!

ఎ. ఎస్. ఎన్. — విశాఖపట్నం

నా వయస్సు 20 సం.లు. నాకు గొంతులో టాన్సిల్స్ వున్నాయి. వీటికి ఆపరేషన్ చేసుకోడానికి వీలులేదని లేడీ డాక్టర్ చెప్పారు. ఆపరేషన్ చేయించుకొనిగాని ఆ టాన్సిల్స్‌ను తొలగించేందుకు వీలులేదా? మరేవిధమైన జాగ్రత్త తీసుకోవాలి! ఈ టాన్సిల్స్‌వల్ల కేన్సర్‌గాని, టి.బి. గాని వచ్చే ప్రమాదము వుందా? బ్లడ్ టెస్ట్‌లో టి. బి. గాని, కేన్సర్‌గాని వున్నట్లు తెలుసుకోవచ్చునా?

★ "టాన్సిల్స్" అనే లింఫ్‌గ్రంధి ప్రతి మానవునికీ ప్రకృతిసిద్ధంగా వుండేవే. వీటివలన మన శరీరానికి మేలే జరుగుతుందని చెప్పాలి. అడపాదడపా ఇవి వాస్తూ, పెద్దవయి ఆహారం మింగుడుపడకపోవటం జరిగినప్పుడు వీటిని తీసివేసే అవకాశం వుంటుంది. వీనిని తీసివెయ్యాలంటే శస్త్రచికిత్స మాత్రమే మార్గం! మందులవల్ల వాపుని తాత్కాలికంగా మాత్రం తగ్గించవచ్చు.

దీనివల్ల కేన్సర్‌గాని "టి. బి. గాని వచ్చే అవకాశం చాలా తక్కువ. రక్తపరీక్షలో యిది వున్నట్లు తెలుసుకొనే ప్రశ్న అసలు రాదు.

—డా. కె. వెంకటేశ్వరరావు

లోకంపోకడ ● ఊమెన్












# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

గిరీంద్ర — ఇలపావులూరు

పురుష హృదయం సరిగ్గా అర్థం చేసుకోవాలని ప్రయత్నం చేసే స్త్రీలు వుండడం సంభవమేనా? స్త్రీలను అర్థం చేసుకోరు యీ మగవాళ్లు అంటూంటారుగా?

★ ఇప్పుడు స్త్రీలంతా చేస్తున్నదేమిటి? పురుష తత్వం అర్థం చేసుకోవాలన్న ప్రయత్నమేగా!

బి హెచ్. ఆర్. జి. — జెంషెడ్‌పూర్

పెద్దవాళ్లపై జాలి చూపి మూర్ఖులిగాని ద్వేషం చూపడం తప్పు కదా?

★ చెడుని చూసి జాలి పడడం తగునా? అని ప్రశ్నించుకోండి ముందు. పెద్దవాళ్లపై జాలి చూపేవాడు తక్షణం మంచివాళ్లకి స్నేహపాత్రుడైపోడు!

నిజంగా ధనవంతుడే అదృష్టవంతుడంటాను మీరేమంటారు?

★ డబ్బున్నవాడు కాదు ధనవంతుడు. దాన్ని అనుభవించేవాడే ధనం కలవాడు.

మీరు తెలివైనవారు కదా? స్త్రీల సమస్య లొచ్చేసరి కెందుకలా విరుచుకుపడతారు?

★ తెలివి కాదు మనిషినిగాని జంతువునుకాని నంపేది. దానిపై వేసే భారం! మరిచిపోకండి. జీవిత మార్గంలో ఎదురయ్యే బరువు బాధ్యతలన్ని మోస్తూ, సృష్టికి ప్రతిసృష్టి చేసే ఆడదాన్ని— ఏ బరువూ చంపనంత సులువుగా చంపేస్తుంది— మగవారి నిర్లక్ష్యం

డి ఎన్. పి. ఎన్ — కలకత్తా

అప్పు పుచ్చుకున్నంత మాత్రాన లోకువగా మాట్లాడితే వూరుకోవచ్చా?

★ తప్పదు — అప్పు తీర్చేదాకా!... ఎప్పుడు అప్పు పుచ్చుకున్నవాడు అప్పిచ్చినవాడికి దాసుడేమరి.

పి జి. బి — వెంకటగిరి

సినిమాలో హీరోయిన్ దుఃఖించేప్పుడు 'నేను ఈ చావుబ్రతుకులమధ్య నలిగిపోతున్నాను' అని విలపిస్తుందే! అసలీ చావుబ్రతుకుకి సంబంధం ఏమిటి?

★ ఏ సినిమాలో హీరోయినో చెప్పకపోతే — యెలా చెప్పడం?! అదే హీరోయిన్ కథలో అయితే — 'నీ ప్రేమకీ నా బాధ్యతలకీ మధ్య' అంటుంది. అదే హీరో కథ అయితే 'నీ త్యాగానికీ నా ప్రేమకీ మధ్య' అంటుంది సినిమా హీరోయిన్‌లకి 'చావు — బ్రతుకు' సమస్య సర్వసాధారణంగా యిదే! ఇక నిజజీవితంలో నంటారా! — చావుకీ బ్రతుక్కీ — మధ్యతరగతికి ఆట్టే తేడా వుండదు కనుక నలిగిపోతూ బ్రతికేస్తారు పోనీ యిలా కదా అని బాధ్యతలు పెంచుకోకుండా బ్రతకరు! తామరతంపరగా సంతతిని; ఈతిబాధలని కోరి తెచ్చుకుంటారు — అనవసరమైన భేషజాలకుపోయి. అంచేత — సినిమాలో చావుకీ బ్రతుక్కీ ఒకటే రేటు — జీవితంలో రేటు లేదు.

కె. ఎ. ఆర్. — వెంకటగిరి

నాకు స్త్రీలంటే మహాద్వేషం. మీకు పురుషులంటే...

★ ద్వేషం లేదు!

ఎన్. ఎస్. ఆర్. — కలకత్తా

స్త్రీకి శీలం ముఖ్యం. మరి పురుషుడికి!

★ పురుషునికీ శీలం ముఖ్యమే — నైతికంగా ఉత్తముంగాలేని వ్యక్తులు — సంఘ జీవితాన్ని కలుషితం చేస్తారు. వేరుపురుగులై దొలిచివేస్తారు. శీలసంపదలేని స్త్రీ పురుషులు — ఎవరైనాసరే తాత్కాలికంగా రాణించకలరేగాని — శాశ్వతంగా కీర్తిగాని, పేరుగాని, ఎలుకుబడిగాని— ఏదీ నిలుపుకోలేరు

డి. ఎన్. పి. — హైదరాబాదు

తెలివైనవాడికి తెలివిహీనుడికి తేడా ఏమిటి?

★ తెలివైనవాడు హరివిల్లు చూసి ఆనందిస్తాడు. బుద్ధిహీనుడే — 'దాని కొనన బంగారం వుందట' అంటూ వెతకడానికి పోతాడు!

పి. వి. ఎస్. ఆర్. — యాదగిరిగుట్ట

ప్రతీ మగవాడు తనకు కాబోయే భార్య చదువుకున్నది, సంస్కారవతి,అందకత్తె కావాలను కుంటాడు. మరి ఆడమ్మాయిలు?

★ ఆడమ్మాయిలూ మగబ్బాయిలలాగానే చదువుకుని భార్యని పోషించకలవాడు, ఆడదాన్ని కూడా మనిషిగా, సాటి మనిషిగా చూడగల సంస్కారం కలవాడు, చూడ చక్కనివాడు కావాలనే అనుకుంటారు.

పి. ఎస్. ఆర్. — కార్వేటినగరం

మనిషి బాధపడడానికి అతని బలహీనతే కారణం అనుకుంటాను...

★ మానసిక దౌర్బల్యం కొన్ని రకాల బాధలకీ, శారీరక దౌర్బల్యం మరికొన్ని బాధలకీ — కారణం అయితే — వీటన్నిటికీ — పెద్ద కారణం అత్యాశ — అసంతృప్తి.

నా కాళ్లమీద నేను నిలబడకలను. గాని ఎందుకో ధైర్యం చేయలేకపోతున్నాను.

★ అది 'రేపు'నితలుచుకొని—పిరికితనం.

---

# రాగబంధం

[23వ పేజీ తరువాయి]

శ్రీనివాస్ వెళ్లిన తరువాత మరో దారిన లోపలికి వెళ్లింది విజయ

విజయ లేదన్న ధైర్యంతో అయిదువందలు లెక్కపెట్టుకుంటూ మేడ దిగుతున్న శ్రీనివాస్ ఎదురుగా విజయని చూసి తడబడుతూ చేతిలోని నోట్లను లొందరగా వెనుక దాచేశాడు. అతడు పడుతున్న అవస్థను చూసి జాలిగా చూసి నవ్వింది.

"అది నీ డబ్బు! నీ యిష్టంవచ్చినట్టు ఖర్చుపెట్టుకోగల అర్హత నీకే వున్నది! యిలా అడిగినవాళ్లందరికీ యిచ్చేబదులు అనాధలు; వికలాంగులున్న సదనాలకి యిస్తే ఒక-ఆశయం ఫలించిందనుకోవచ్చు! మేరీ వాడిన గులాబీ! తేనెపూసిన కత్తి! నువ్వెంత దూరంగా వుంటే నీ భవిష్యత్తుకు అంత మంచిది! ఆ నిజం నువ్వు గ్రహించేవరకూ నీకీ చాటుమాటు అవస్థలు తప్పవు! నీదగ్గిర డబ్బున్నంతకాలం నిన్ను పీక్కుతినే మేరీలాంటి రాబందులు చాలామంది బైలుదేరుతారు. నీకు అవసరం వచ్చిననాడు వీళ్లెవరూ నిన్ను ఆదుకోరు! నీకై నువ్వు తెలుసుకోగలిగిన రోజున నేనన్న మాటలు గుర్తుకు రాకపోవు! నీ దారికి అడ్డురావటం నా అభిమతం కాదు!"

జవాబుకయినా ఎదురు చూడకుండా లోపలికి వెళ్లిపోయింది విజయ.

స్థాణువయిపోయాడు విజయ అన్న మాటలు ఒక్కొక్కటే ఒక్కో శూలంలాగా హృదయంలో నాటుకుపోయింది తానిక్కడే వుంటే మేరీ లోపలికి వచ్చేస్తుందన్న భయంతో తొందరగా తోటలోకి వెళ్లాడు.

ఆ రాత్రి తొమ్మిది గంటలయినా శ్రీనివాస్ భోజనానికి రాలేదు మేడమీద తన గదిలోనూ లేడు. డబ్బుతోపాటు శ్రీనివాస్‌ని కూడా కొంగున ముడేసుకుని వెళ్లిపోయిందేమో మేరీ! అనుకుంది విజయ. శ్రీనివాస్ ఏ వేళకి వస్తాడోనని అలాగే హాల్లో కూర్చుంది చదువుకుంటూ!

హాలులో యింకా లైటు వెలుగుతుంటంతో పడుకున్న భాస్కర్ లేచి మెట్లమీదకి వచ్చాడు

"ఏమ్మా విజయా! యింకా చదువేమిటమ్మా! తొమ్మిది దాటింది. పడుకోకూడదూ?" అనడిగాడు.

"చినబావ యింకా రాలేదు. బావ రాగానే వడ్డించి పడుకుంటాను!"

"వాడు యింటికి రావటానికి ఒక టైం అంటూ వుంటేగా? రేపటినుంచీ నాయర్‌ని యింట్లోనే వుండమంటానులే! పగలంతా కాలేజీ! సాయంత్రం తోటపని! ఈ వేళ వరకూ రాత్రిళ్లు మేలుకుని వుండటం! ఆరోగ్యం పాడవుతుందమ్మా!"

"మరేం ఫరవాలేదులే పెదబావా! చినబావకి కడుపునిండా తినటంకూడా తెలియదు. దగ్గిర వుండి కొసరి కొసరి వడ్డించాలి!"

"వాడికోసం నువ్వింత శ్రమపడుతున్నావా విజయా?"

"శ్రమ ఏమున్నది? మన మనుష్యులకు మనం చేసుకోకపోతే యింకెవరు చేస్తారు చెప్పండి! మరో గంట చూసి నేనూ పడుకుంటాను! మీరు వెళ్లి పడుకోండి!"

భాస్కర్ యింకేమనలేక తన గదిలోకి వెళ్లాడు. శ్రీనివాస్ కోసం ఎదురు చూసి చూసి ఆ సోఫాలోనే పడి నిద్రపోయింది విజయ

[ఇంకా ఉంది]


డాక్టరుగారూ! నా బొమ్మ పాపకు
కులాసాగా లేదండి.
కాస్త పరీక్ష చేయండి.

జ్వరం లేదు. కానీ,
కడుపునొప్పితో అవస్థ పడుతోంది.


పాపకు ఎప్పుడైనా
ఉపశమనంగా లేనప్పుడు
వుడ్‌వర్డ్స్ గ్రైప్‌వాటర్
ఉపశమనాన్ని చేకూర్చగలదు.
మా అమ్మకూడా నాకు
దీనినే యిచ్చేది.


IMPORTANT TO MOTHERS
WOODWARDS CELEBRATED
GRIPE WATER
INFANTS' PRESERVATIVE



యల విలువ కలిగిన ఆ ఉంగరాన్ని అమ్మజూపితే వంద రూపాయలు యివ్వడానికి కూడా బెట్టు చేశాడు మార్వాడీ. రెండు, మూడు షాపులుతిరిగి,అతికష్టంమీద నూట పాతికకి అమ్మిబయట పడ్డారు ఇద్దరూ.

"ఈ అనుభవంతో నైనా నువ్వు కళ్ళు తెరిస్తే మంచిది భానూ!" అన్నాడు రఘు బాధపడుతూ. ఏమీ మాట్లాడలేక, ఒక్కసారి అతడి చెయ్యి గట్టిగా నొక్కి ఊరుకున్నాడు భాను.

ఆ సాయంత్రమే హాస్టల్ ఫీజు కట్టేసి గాలి పీల్చుకున్నాడు సంతృప్తిగా.

రాత్రి మెస్ నించి వస్తుంటే ఎదురయిన సెకండియర్ స్టూడెంట్స్ వ్యంగ్యంగా పలకరించారు.

"ఏం గురూ, బాగున్నావా ?" అంటూ.

"అతనికేరా, ప్రిన్సిపాల్ వాళ్ల మామకి ఫ్రెండ్. అందుకే అతను నిక్షేపంలా వుంటాడు ఎటొచ్చీ అతణ్ణి నమ్ముకున్న వాళ్లే మునిగేది!" నవ్వుతూ అన్నాడు మరొకతను వంకర నవ్వులతో వెళ్లిపోయారు వాళు.

దిగ్భ్రాంతుడయ్యాడు భాను. 'వీళ్ళకెలా తెలుసు ప్రిన్సిపాల్‌ని మామయ్య ఎరిగున్న విషయం ?'

భానుకి తెలీదు యిలాటి విషయాలు దాగవనీ, ఎప్పుడో శంకర్రావుగారు ఫోను చేసినప్పుడో, ప్రిన్సిపాల్ మాటలు విని, ఎవరో యీ విషయం యింకెవరికో చేరవేశారనీ, అలా చేస్తూనే వుంటారనీ-అందుకే కావాలని ఆరాలు తీసే వాళ్ళకి అలాటి విషయాలు తెలుసుకోవటం ఓ పెద్ద పని కాదనీ!

అవమానంతో, పక్కనున్న రఘుని కూడా పట్టించుకోకుండా రూముకొచ్చి, బెడ్ మీద వాలిపోయాడు.

పుస్తకం తీసుకు టేబిల్ ముందు కూర్చున్న రఘు అన్నాడు, "చదువుకో భానూ, కాస్సేపయినా..."

"ఊఁ..." అన్నాడు భాను. మరేం మాట్లాడలేదు.

"ఇందాక వాళ్ళు అన్న మాటలకే విచారిస్తున్నావా ?"

"విచారించే మాటలు కాదా వాళ్లన్నవి ?" కళ్లమీంచి చేతులు తీస్తూ అన్నాడు భాను. అతడి కళ్ళల్లో తడి చూసి

## జీవనపోరాటలో...

(18వ పేజీ తరువాయి)

ఆశ్చర్యపోయాడు రఘు. జాలి కలిగింది అతడంటే.

"లేదు భానూ, అలాటివాళ్ల మాటలు నువ్వు పట్టించుకోనక్కరేదు. అందులో నిజం ఏదయినా వుంటే కదా నువ్వు బాధ పడాలి!"

"నువ్వే చెప్పు రఘూ! వాళ్ళన్నది నిజమా? సూరిబాబు నన్ను నమ్మకు చెడిపోయాడా? అతడి స్నేహం కాదూ నన్నిలా చేసింది?" లేచి కూర్చుంటూ అడిగాడు భాను.

కొంచెం యిబ్బంది పడ్డా, నిర్మొగమాటంగా అన్నాడు రఘు, "రెండూ నిజం కాదు భానూ! సూరిబాబుకి అల్లరిగా తిరగటమూ, ఆడపిల్లల్ని గొడవ పెట్టటమూ అలవాటే! నీవల్ల వచ్చాయనటం అన్యాయం!

అలాగే, అతడివల్ల నువ్వు -చెడిపోయావనుకోవటమూ నిజం కాదు. నీకు నీ స్నేహితుణ్ణి బట్టి వదుచుకునే అలవాటు వుంటే, పుస్తకాల పురుగులా వదుండే అలవాటు నీకు కాలేదే? నీకు ఒక్క సూరిబాబుతోటే స్నేహం ఎందుకేర్పడాలి—అతడి గురించి ఒక్క మాట చెడుగా అన్నా నువ్వు సహించావా?

నీలోనూ బలహీనతలున్నాయి. అవి అతడి సాన్నిహిత్యంలో మరింత పెరిగాయి.

జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడిక సూరిబాబు లేడుగా! మిగతావాళ్ళ మాటలు పట్టించుకోకు. ఇప్పుడైనా మించిపోయింది లేదు. గనుక, యిప్పట్నుంచీ జాగ్రత్తగా చదవటం ప్రారంభించు. అంతేచాలు!"

మాట్లాడకుండా అతడి మాటలు మననం చేసుకుంటూ మంచంమీదే వెనక్కి వాలిపోయాడు భాను.

## 16

చదువు గురించి పట్టించుకోకుండా తిరిగినన్నాళ్లూ హాయిగానే గడిచిపోయింది. సిలబసేమిటో కూడా తెలుసుకోకుండానే, ఏవో పది పన్నెండు ప్రశ్నలు మోడల్ పేపర్స్ సాయంతో గుర్తు పెట్టి, అవిబట్టీ పట్టి పరీక్షకి వెళిపోయి, తెలిసినవేవో రాసి వచ్చేస్తే ఏ బాధా అనిపించలేదు

కానీ యిప్పుడు టెక్స్టుబుక్ తెరిచి, కోర్సు రెగ్యులర్‌గా ఫాలో అవుతుంటే మాత్రం అక్షరం కూడా తలకెక్కటం లేదు. ఈ తరాని వాడు నీళ్లలో పడినట్టుగా అయింది భానుపని. బోర్డుమీద లెక్చరర్ చేస్తున్నంతసేపూ అన్నీ అర్థమయినట్లే అనిపిస్తాయి. రూమ్‌కొచ్చి బుక్స్ తెరిస్తే ఒక్కటికూడా అర్థంకాదు!

కానీ ఉపయోగించుకోగలిగితే హాస్టల్లో వుండే సదుపాయం, ఇంటిదగ్గరుండి చదువుకునే విద్యార్థులకి వుండదు. హాస్టల్లో వుంటే, ఏ ప్రాబ్లం అర్థంకాక పోయినా, తోటి విద్యార్థుల దగ్గరికి వెళ్ళి తెలుసుకునే అవకాశాలు ఎక్కువ. అందుకే, శలవు రోజున 'డే స్కాలర్స్' కూడా హాస్టల్‌కి వచ్చి చదువుకునేవారు.

ఇదివరలో వాళ్ళని చూసి 'జిడ్డుగాళ్ల'ని హేళన చేసిన భానుకి యిప్పుడు తనూ వాళ్లతో కలవాలనిపిస్తోంది! అతనికి తెలియనివన్నీ రఘురాం శ్రద్ధ తీసుకుని వివరిస్తూ వుండేవాడు. అతను చదువుకుంటున్నప్పుడు, భాను తన క్లాస్‌మేట్స్ దగ్గరకు వెళ్ళి నేర్చుకోసాగాడు.

క్రమక్రమంగా సూరిబాబు వెళ్లిపోయిన యీ అయిదారు నెలల్లోనూ భాను తోటి వాళ్ళలో కాస్త 'గుడ్‌విల్' సంపాదించుకోగలిగాడు.

# నాకు తెలుసుగా గ్లైకోడిన్ నమ్మకమైనదని–

## ఆయన దగ్గుకు ఇట్టే ఉపశమనాన్ని కలిగిస్తుందని..



## భారతదేశంలో దగ్గులను నివారించే యితర మందులకన్న, గ్లైకోడిన్ ఎందరికో దగ్గునుండి ఉపశమనాన్ని కలిగించింది. అందుకే ఇది ప్రథమశ్రేణికి చెందినది.




ఇది దగ్గు బాధించే అన్ని భాగాలలోనూ త్వరగా పనిచేసి త్వరితమైన, ఖచ్చితమైన ఉపశమనాన్ని యిస్తుంది.

- గొంతు మంటను తగ్గిస్తుంది.
- కఫమును తొలగించి జలుబు వల్ల వచ్చే దగ్గుల నుండి ఉపశమనాన్ని యిస్తుంది.
- సుఖ నిద్రను కలిగించి, ఛాతీలో కండరాల బిగువును తగ్గించి, సులభంగా శ్వాస పీల్చేందుకు తోడ్పడుతుంది.

దగ్గు ఎలాంటిదైనాసరే—పూర్తిగా అదుపులోకి తెచ్చేందుకు మంచి రుచికరమైన గ్లైకోడిన్‌పై మీరు ఆధారపడవచ్చు.




గ్లైకోడిన్—దగ్గులను కొట్టిపడవేయు భారతదేశపు ఛాంపియన్—విశ్వసనీయమైన మందులను తయారుచేసే అలెంబిక్ సంస్థ ఉత్పాదన.

everest/520/ACW-tl

మొదటో చిల్లరగా తిరగాలని మనసు పీకినా, మారిబాబు లాంటి తోడు లేక పోవటమూ, ఆ తరహా మిగతా వాళ్ళు అతణ్ణి అసహ్యించుకోవటమూ, వీటన్నిటినీ మించి ఏ రోజు చదువుకోకపోయినా మర్నాడల్లా 'రాధ' మాటలూ, పాత జ్ఞాపకాలూ మనసుని కృంగదీయటమూ జరగటంతో ఆధ్యాస తగ్గిపోసాగింది.

(ఇంకా వుంది)

# ఫాలాక్షుని డైరీ

## కొట్టు కోసం కొట్లాట!

కుమారపాలెం అనే వూళ్లో ఒకచోట కొట్టు పెట్టుకునే విషయం మీద 35 ఏళ్ల పెరుమాళ్లకు అదే వయస్సు కుప్పుస్వామికి తగదా వచ్చిందట. ఆ స్థలంలో నేను కొట్టు పెట్టు కోవాలంటే నేనే పెట్టుకోవాలని ప్రారంభించి ముఖాలు పచ్చడయ్యేలా కొట్టుకున్నారట. అంతతో ఆగక సోడా బాటిలు తీసి కొని ఒకరితలమీద ఒకరు కొట్టుకున్నారట కర్రలతో శక్తివంచన లేకుండా తెలుగు సినిమా స్టంటు సీనును మించి కొట్టుకున్నారట. జనం ఎవరూ ఆపలేకపోయు నందువల్ల, పోలీసులు ఆ స్థలానికి రానందువల్లా వారిద్దరూ అలా కొట్టుకుని కొట్టుకుని చివరికి రక్తపు మడుగుల్లో విలవిలా తన్నుకు చనిపోయా రట. ఆ వూరి ప్రజలంతా వో వలయంగా ఏర్పడి ఉచిత వినోదాన్ని చూసినట్టు ఈ దారు ణాన్ని కళ్లారా చూశారట.

## నకిలీ డాక్టరు మోసం!

మదరాసులోని మైలాపూరు సి. ఐ. టి.నగరులో సుబ్రహ్మణ్యం అనే వో చాణక్యుడు గత కొన్నేళ్లుగా డాక్టరుగా, గర్భస్రావ నిపుణుడుగా మంచి పేరు, డబ్బు సంపాదించుకున్నాడట. మీకు ఎన్నో నెల కడుపైనా బెంగపడే పనిలేదు. నా వద్దకు రండి. నేను చికిత్స చేస్తాను అని ప్రకటించుకునేవాడట. చికిత్సకోసం వచ్చిన అమ్మా యిలను [పెళ్లి కాకుండా గర్భం తెచ్చుకున్న వారిని] ముందు మీరు నా కోర్కె తీరుస్తే నేను మీ కోరిక తీరుస్తానని బేరం పెట్టి, తన కోర్కె తీర్చుకొని, నాటు మందు వారి గర్భంమీద రాసి, మర్దనా చేసి, గర్భస్రావం చేసేవాడట ఈతనసలు డాక్టరు పట్టా పొందలేదని, చదవను కూడా లేదని, ప్రజలను మోసం చేస్తున్నాడని పోలీసులు సుబ్రహ్మణ్యాన్నరెస్టు చేసి జైల్లో పెట్టారట. ఏమంటేనేం! దంపినమ్మకు బొక్కి నదే దక్కుడు అనీ అన్నారు.

## పెళ్ళివారి వేషంతో మోసం

తమిళనాడులో కొన్ని వూళ్లలోని బట్టల షాపులలోకి వో ఇరవమంది ఆడామగా పెళ్లి వారిలా బట్టలు కొనడానికి వచ్చినట్లే వచ్చి, బట్టలు ఎంచి, పెదిమలు విరిచి మరోక కొట్లోకు చూద్దామని వెళ్లిపోతూ ఉన్నారట. వారెళ్లాక చూస్తే ఆ కొట్లో కొన్ని ఖరీదయిన చీరలు అంతర్థానమయ్యేవట. వీరిని పట్టడానికి పోలీసు చేసిన ప్రయత్నం ఫలించి వారు దొరికారట. ఈ గుంపుకు నాయకురాలు 34 ఏళ్ల కాళి యమ్మట. ఆమెనరెస్టు చేయగానే ఆమె ప్రియుడు 25 ఏళ్ల పెరుమాళ్ళు కూడా వచ్చి పోలీసులకు లొంగిపోయాడట.

# మాయాజాలం మతికట్టు

## మాజిక్ బాట్

విద్య నేర్చుకోగానే సరికాదు. దానిని సమయానుకూలంగా సందర్భాన్నిబట్టి అప్పటి కప్పుడు వినియోగించగలిగే చాకచక్యంకూడా ఎంతేనా అవసరం.

మొన్న ఆదివారంనాడు మా కాలనీ వాళ్ళందరం కలిసి పబ్లిక్ గార్డెన్స్‌కి 'పిక్నిక్'కి వెళ్ళాము.

కాసేపు గార్డెన్స్ అంతా తిరిగి, తర్వాత బాలభవన్, హెల్తు మ్యూజియమ్, ఆర్టు గ్యాలరీ అన్నీ చూడడం ముగించుకుని, ఆఖరుకి అందరం నీడగా వున్న చల్లటి ప్రదేశానికి చేరి, మేము తెచ్చుకున్న చిరుతిళ్ళు తింటూ కబుర్లు చెప్పుకోడం ప్రారంభించాము.

ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పు కుంటూండగా, యింతలో ప్రక్కింటి శేషగిరిరావుగారు, నన్నుద్దేశించి, "మిష్టర్ కామేష్, మీ మెజీషియన్స్ వున్నపళంగా ఆన్ ది స్పాట్ 'మేజిక్స్' ఏమి చెయ్యలేరని పందెం" అన్నారు.

"సరే, ఐతే నేను మీ పందానికి రెడీ" అంటూ ఆలోచించసాగాను.

ఇంతలో ఐస్‌క్రీం కేండీలు అమ్ముకుంటూ ఒకడు బండితో మావైపుగా వచ్చాడు.

వెంటనే నాకొక ఐడియా తట్టింది!?

ఐస్‌క్రీం కుర్రాడి చేతిలో ఒక రూపాయి పెట్టి, ఐస్‌క్రీం కేండీ ఒకటి తీసుకుని, సీరియస్‌గా క్షణంలో తినేసి, పాంటు జేబులోంచి ఒక పెన్‌నైఫ్ తీసి, చేతిలో మిగిలిన ఐస్‌క్రీం బద్దని నైస్‌గా చెక్కి ఫైన్‌గా చిన్న క్రికెట్ బాట్‌లా తయారు చేశాను.

తర్వాత బాట్‌కి ఒకవైపు బాల్ పాయింట్ పెన్‌తో 'కామేష్' అని ఇంగ్లిషులో నా పేరు వ్రాసి, రెండవవైపు కూడా నా పేరు ప్రింటు చేస్తానని, చిత్రంలో సూచించిన విధంగా బొటనవ్రేలు, చూపుడు వ్రేళ్లతో బాట్‌ని పట్టుకుని అత్యంత వేగంగా త్రిప్పాను.

అంతే! ఇంకేముంది!! ఆశ్చర్యం!!!

బాట్‌కి రెండవవైపు కూడా నా పేరు ప్రింటు అయినట్లుగా కనబడడంతో అందరూ ఆశ్చర్యపోతూ అట్లా వున్నపళంగా అప్పటి కప్పుడు ఆ విధంగా వినోదాన్ని కలిగించినందుకు ప్రక్కింటి శేషగిరిరావుగారితో సహా మా కాలనీ వాళ్లంతా నన్నెంతో అభినందించారు.

వెంటనే నేను బాట్‌ని పేరులేనివైపుగా పట్టుకుని అత్యంత వేగంగా త్రిప్పేసరికి అంతవరకు రెండువైపులా కనిపించిన పేరు ఉన్నట్లుండి రెండువైపులా మాయమయినట్లుగా కనబడేసరికి అక్కడున్న వారందరికీ నోటమాట రాలేదు!

తర్వాత కాసేపటికి అంతా తేరుకున్నారు.

విధానం : ఈ సందర్భం వచ్చి మీరూ యీ అయిటమ్ చెయ్యదల్చుకుంటే, ఒకవైపు మీ పేరు వ్రాసుకుని, చిత్రంలో చూపిన విధంగా అత్యంత వేగంగా బాట్‌ను త్రిప్పాలి.

గమనిక : ఐస్‌క్రీం బాట్‌ని వేగంగా త్రిప్పడం చాలా అవసరం. బాట్ వేగం తగ్గించి త్రిప్పితే ప్రేక్షకులు తక్షణం మెజీషియన్లుగా మారే ప్రమాదం ఎంతేనా వుంది.

—భావరాజు కామేష్

# వెదజల్లబడుతోన్న మాధుర్యం
# 65 సంవత్సరాలకు పైగా ఆనందం

మీ కోసమే ప్రత్యేకమయిన
రకాలలో ఎక్లెయర్‌లు:
కోకోనట్, ఫిగ్,
చాక్‌లెట్.






మిఠాయిలు మరియు టాఫీలు

ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్

PRS/2767/TEL

# కథ కాని కథ



**వేదగిరి రాంబాబు**

నెంబర్ 'త్రీ' బస్‌కోసం ఎదురు చూస్తూ శంకర మఠం దగ్గర నిలబడ్డాను.

అలా అక్కడ నిలబడి బస్‌కోసం ఎదురు చూట్టం ప్రారంభించి అప్పటికి ఇరవై నిముషాలు దాటిపోయింది. బస్సులు వస్తున్నై, పోతున్నై. కానీ వాటిలో మూడో నెంబరు మాత్రం వుంటంలేదు. వెళ్తే ఒకదానివెంటే మరొకటి రెండో మూడో వెళ్తాయి! లేకపోతే ఏ అరగంట దాకానో ఒక్క బస్సూ వుండదు!

ఆ రోజు ఆదివారం కావడంవల్ల మారేడ్‌పల్లిలో వున్న మా పెదనాన్నా వాళ్ళింటికి వెళ్దామని బయల్దేరాను.

ఉద్యోగరీత్యా నేను హైద్రాబాద్ వచ్చి హోటల్ భోజనం, రూమ్ నిద్ర ప్రారంభించి రెణ్ణెల్లు దాటుతోంది. అయినా ఇంతవరకూ పెద్ద చెప్పుకోతగ్గ పరిచయాలేమీ ఏర్పడలేదు. బంధువులు కూడా ఈ జంటనగరాల్లో మా పెదనాన్నా వాళ్ళుతప్ప మరెవ్వరూలేరు. మా పెదనాన్నకి కొడుకుల్లేరు! ముగ్గురూ కూతుళ్ళే! అందరూ చాలా సరదాగా వుంటారు. వాళ్ళింటికెళ్తే మంచి కాలక్షేపం. అందుకని ఆఫీసుకి శలవొచ్చిందంటే వుదయం భోంచేయంగానే వాళ్ళింటికి వెళ్తాను.

మాలతి, లత మా పెదనాన్న పెద్ద కూతురు. అది చాలా బాగా పాడుతుంది. కాసేపు దాని పాటలు వినడం, తర్వాత అందరంకల్సి కబుర్లు చెప్పుకోవడం, కారమ్‌బోర్డు ఆడుకోవడం, ఇంకా టైముంటే అలా బయటి కెక్కడికైనా షికారు కెళ్ళడం. ఇలా చాలా సర్దాగా గడిచిపోతుంది. రాత్రి భోజనాలు కాగానే తిరిగి రూమ్‌కి బయల్దేరతాను. రొటీన్ లైఫ్ మధ్య అదో పెద్ద రిలీఫ్!

విసుగ్గా వాచీ వంక చూసుకున్నాను.

పన్నెండుంబావ్!

ఎక్కడా బస్సొస్తున్న జాడలేదు.

ఎండ నిప్పులు చెరుగుతోంది.

వేడిగాలి సుళ్ళు తిరుగుతోంది.

చెమటతో లోపలి బనీను, చొక్కా చాలా భాగం తడిసిపోయింది.

చిరాకేస్తోంది!

ఒక్క క్షణం — 'ఆటోలో వెళ్ళిపోతే?' అన్పించింది. కానీ ఇంతసేపూ వెయిట్‌చేసి, ఆటోలో ఎక్కగానే వెనకే బస్సొస్తే ప్రాణం వుసూరుమంటుంది. అందుకని ఆ ప్రయత్నాన్ని విరమించుకుని బస్‌కోసం వెయిట్ చేస్తూ నించున్నాను. రకరకాల ఆలోచన్లు ఈగల్లా మనసుని ముసరసాగాయి.

లత, పద్మ, జయ, పెదనాన్న, అమ్మ— అంతా ఇంకా ఎందుకు రాలేదోనని ఎదురు చూస్తుంటారు. అసలు పెదనాన్నకి నేనిలా రూమ్ తీసుకుని వంటరిగా వుండటం ఇష్టంలేదు. 'వచ్చేసి మాతోపాటే వుండరా' అంటాడు.

'నువ్వు డబ్బులిస్తే వాడు తీసుకోడు. ఏమీ ఇవ్వకుండా ఏన్నాళ్ళని అక్కడుంటావ్?' అంటారు నాన్నగారు.

# శిల్పిఆర్ట్స్ గ్రీటింగ్ కార్డులు

## మరొక కొత్త కానుక

అనేకప్రశంసలనొందిన



# శృంగార నాయికలు

## బాపు వర్ణచిత్రాలు • కృష్ణశాస్త్రిగారి చిత్రవర్ణనలు

**శృంగారనాయికల సెట్ రు. 12.50**

(అందమైన కొత్తరకం గిఫ్ట్ ప్యాక్)

అష్టవిధ నాయికలలో ఒక్కొక్క నాయికకు ఒక్కొక్క కార్డు. తెలుగులో న్యూఇయ్యర్ గ్రీటింగ్స్ సందేశం.

మనియార్డర్‌గాని, పోస్టల్ ఆర్డర్‌గాని పంపాలి. వి.పి.పి. లేదు. డబ్బు పంపకుండా వ్రాసే ఉత్తరాలకు జవాబు ఇవ్వలేము




# న్యూ ఇయర్ తెలుగు గ్రీటింగ్ కార్డులు

అందుకనే ముందు వో వారం రోజులు వాళ్లింట్లోనున్నా, తర్వాత వో రూమ్ చూసుకుని నల్లకుంట వచ్చేశాను.

"ఎక్స్‌క్యూజ్ మీ!" పలకరింపుతో ఆలోచనల్లోంచి బయటపడి పక్కకి చూశాను.

బహుశా అతనికీ నా వయసే వుంటుంది. ఇరవైనాలుగేళ్లుండొచ్చు! పెరిగిన గడ్డం, వలిగిన గుడ్డలు, మొహంలోని దైన్యం — అతని స్థితిని చెప్పకనే చెప్తున్నాయ్!

ఏంటన్నట్లు అతనివంక చూశాను.

"మీరు వేరేగా అనుకోకపోతే..." నసిగాడు.

ఏదో చెప్పాలనుకున్నట్లుంది. చెప్పడానికి తటపటాయిస్తున్నాడు.

అతన్ని చూస్తుంటే అతని పరిస్థితి అర్థమవుతూనే వుంది. ఆర్థిక సహాయం కోసం వచ్చుంటాడు. కాకపోతే అతన్లో మరుగుపడిపోబోతున్న సంస్కారం తాలూకు మొహమాటం అడ్డుపడుతున్నట్లుంది. అందుకనే అడగలేకపోతున్నాడు. అతని అవస్థ చూస్తుంటే బాధేసింది.

"పర్లేదు చెప్పండి" అన్నాను.

"మాది తెనాలి. అక్కడే బి. యస్. సి. వరకూ చదువుకున్నాను. చదువుకోవడమైతే నావల్లైందికాని వుద్యోగం సంపాదించడం నావల్ల కాలేదు రోజులు సంవత్సరాలుగా మారిపోతున్నాయి. రోజుల్తోపాటు

# కథ కాని కథ

అందరికీ — చివరికి మా ఇంట్లో వాళ్ల కూడా నామీద అభిమానం పూర్తిగా కరిగిపోయి, అసహ్యం చోటు చేసుకోసాగింది. నన్ను, నా బాధని అర్థం చేసుకునే వాళ్లే కరువయ్యారు. అందరూ సూటిపోటి మాటలనడం ప్రారంభించారు. ఇక అక్కడుండలేక కట్టుబట్టల్తో,సర్టిఫికేట్లతో ఇక్కడికి వచ్చేశాను. ఏదైనా వుద్యోగం దొరికి నా కాళ్లమీద నిలబడ్డప్పుడే తిరిగి ఇంటికి వెళ్లాలనుకున్నాను. ఆత్మాభిమానంతో వచ్చేయడమైతే వచ్చేశానుగాని, ఇక్కడా నాకుద్యోగం దొరికే ప్రాప్తం కన్పించడంలేదు. మూడు రోజుల్నించీ కన్పించిన ప్రతి ఆఫీసుకీ వెళ్తూనే వున్నాను. కానీ ఫలితం శూన్యం. వో నిట్టూర్పు విడిచి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

"భోంచేసి రెండు రోజులైంది. నీర్సంగా వుంది ప్లీజ్! నన్నర్థం చేసుకుని ఏదైనా సహాయం చేయండి" కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకున్నాడు.

అతన్నలా చూస్తుంటే విపరీతమైన బాధేసింది.

వో అర్ధరూపాయి అతనికిద్దామనిపించి జేబులోకి చెయ్యి పోనిచ్చాను.

అతను ఆశగా నా వంకే చూస్తున్నాడు.

"పాపం!" అన్నంతిని రెండు రోజులైందిట. నేనర్ధరూపాయిస్తే మాత్రం లాభమేంటి? అతను తింటానికేదైనా ఇప్పిస్తే బావుండనిపించింది.

"నాతో రండి" అతన్తో అంటూ ఎదురుగావున్న స్వీట్‌షాప్‌వేపు దారితీశాను. అతను నావెంటే వచ్చాడు.

రెండు రకాల స్వీట్లు తెప్పించాను.

అతను ఆవురావురంటూ తినేశాడు.

పాలు తెప్పించాను.

అతను పాలను త్రాగుతుండగా 'త్రీ' వచ్చింది.

"మీరు నెమ్మదిగా తాగి వెళ్లిపోండి. నేను బిల్లు చెల్లించి వెళ్తున్నాను" గబగబా కౌంటర్ దగ్గరకెళ్లి బిల్లు చెల్లించి బస్‌కేసి పరుగెత్తాను.

నేను వెళ్లేసరికి బస్ వెళ్లిపోయింది.

దాదాపు — అరగంటనించీ బస్ కోసం వెయిట్ చేస్తున్నాను. తీరా బస్సొచ్చినా అందుకోలేకపోయాను. తర్వాతి బస్ మళ్లీ ఎంతసేపటికొస్తుందో!

ఆ ఎండలో అక్కడ నిలబడలేక తిరిగి స్వీట్‌షాపు దగ్గరకొచ్చాను.

అప్పుడే అతను బయటికొచ్చాడు.

"దాదాపు అరగంట నించీ బస్ కోసం వెయిట్ చేస్తున్నాను. చివరికి వచ్చింది కాని మిస్సయ్యాను" అన్నానతన్తో.

"మంచిశాస్తే జరిగింది!" అన్నాడతను నవ్వుతూ.

అతని నవ్వులో ఓ విధమైన ద్వేషం కనిపించింది. ఆశ్చర్యంగా అతని వేపు చూశాను.

"లేకపోతే ఏమిటి! నేను నా గొడవంతా చెప్పుకొని, ఆకలిగా వుందని ప్రాధేయపడితే మీకు నామీద ఏమాత్రం నమ్మకం కలగలేదు. అందుకే నాకు డబ్బివ్వకుండా మీరే తీసుకెళ్లి తినిపించారు. ఎదుటి మనుష్యుల్ని సరిగా అర్థం చేసుకోని మీలాంటి వాళ్ల కిలాగే జరుగుతుంది" అనేసి చరచరా వెళ్లిపోయాడతను.

మరో మూడో నెంబరు బస్సు నా ముందు వచ్చి వెళ్లిపోయినా కదలకుండా అక్కడే నిలబడి పోయాను.



# హైదరాబాద్ నోట్ బుక్

## సమిష్టి నాయకత్వం

కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి నవంబర్ 4 వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో మాట్లాడుతూ, ఇందిరాగాంధి అనుకూల పక్షం హడావిడి వల్ల కాంగ్రెస్ చీలిపోతుందనే ప్రచారం ఖండించారు. అందరి దృష్టి కాంగ్రెస్‌లో కాంగ్రెస్ సమైక్య స్థాపనమేనన్నారు. శ్రీమతి ఇందిరాగాంధిని వేరు చేస్తున్నారనే ప్రచారం కూడ నిరాధారమని కాని, వ్యక్తి ప్రయోజనాలకన్నా పార్టీ ప్రయోజనాలు ముఖ్యమని, పార్టీ సమైక్యానికి సమిష్టినాయకత్వమే శరణ్యమని అన్నారు.

## ప్రాకృత్ అకాడమీ :

తెలుగు దేశంలోని ప్రాకృత శాసనాలు, తెలుగు వారు రచించిన ప్రాకృత గ్రంథాల ప్రచురణ, పరిశోధన ప్రధాన లక్ష్యంగా "ప్రాకృత అకాడెమి అనే సంస్థ అక్టోబర్ 24న తుల్జాగూడలో (మొజంజాహిమార్కెటు ఎదుట) నెలకొన్నది. ఈ ప్రారంభోత్సవ సభకు ప్రముఖ విద్వాంసులు శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి అధ్యక్షత వహించారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కాలేజి వైస్ ప్రిన్సిపాలు డాక్టర్ ప్రమోద్ గణేశ్ లాల్యే దీపాన్ని వెలిగించడంద్వారా అకాడెమికి ప్రారంభోత్సవం జరిపారు. ప్రారంభంలో శ్రీ తిరుమల రామచంద్ర ప్రాకృత అకాడెమీ స్థాపన ఉద్దేశం వివరించారు. వజ్జా లగ్గమనే ప్రాకృత సంకలన కావ్యంలోని తెలుగు పదాలను గురించి తిరుమల రామచంద్ర చదివిన పరిశోధన వ్యాసంపై జరిగిన చర్చలో శ్రీమతి కె. కమల (రీడర్ సంస్కృత శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం), శ్రీ కె. సుబ్బారావు (ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి కార్యదర్శి) శ్రీ హరినారాయన్ లాల్ (నోటరీ), శ్రీ కె. రఘుపతిరావు, శ్రీమతులు సింధులాల్యే, కె. అన్నపూర్ణమ్మ ముప్పుగువారు పాల్గొన్నారు. శ్రీ కృష్ణపతి ధన్యవాదాలతో ప్రారంభోత్సవం సమాప్తమైంది.

## వందేమాతరం శతాబ్దం :

బంకించంద్ర చటర్జీ వందేమాతరం గేయం రచించి ఇప్పటికి ఒక శతాబ్దం పూర్తయింది. ఈ సందర్భంలో వందేమాతరం సమారోహ సమితి ఏర్పాటుచేసిన శతాబ్ద్యుత్సవంలో పలువురు ప్రముఖులు ప్రసంగించారు. ప్రపంచ చరిత్రలో వందే మాతరం గేయం జనాన్ని ఆకర్షించినట్లుగా ఏ గేయమూ ఆకర్షించలేదని కేంద్రమంత్రి శ్రీ సేర్‌సింగ్ అన్నారు. రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ గోపాలరావు ఎక్‌బోటే, ఉస్మానియా వైస్ చాన్సలర్ శ్రీ జి.

రామిరెడ్డి ప్రసంగించారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ ప్రకాశ్ వీర్ శాస్త్రి వందేమాతరం ఉద్యమం చరిత్ర వివరించి, ఈ ఉద్యమంలో పాల్గొన్న వందేమాతరం రామచంద్రరావును ప్రశంసించారు. శ్రీ వందేమాతరం రామచంద్రరావును పలువురు సన్మానించారు.

## వెన్నెలకంటి రాఘవయ్య :

అర్ధశతాబ్దానికిపైగా అనాదిజాతులైన ఏనాదులకు నిస్వార్థసేవ చేస్తూ, ఇప్పటికీ ఒక అనాథ శరణాలయం నడుపుతూ, ఆంధ్రరాష్ట్ర ఆదిమ జాతి సంఘానికి గౌరవాధ్యక్షులుగా ఉన్న దేశసేవక కురువృద్ధుడు, 80 సంవత్సరాలు బాలుడు శ్రీవెన్నెలకంటి రాఘవయ్యను రాష్ట్ర గిరిజనోద్యోగి సంక్షేమ సంఘం అక్టోబర్ 15న సన్మానించడం ఎంతో ప్రశంసించదగింది. రాఘవయ్య ఆరు దశాబ్దాలుగా అనాదిజాతుల సేవలో నిమగ్నులై వున్నారు. నేరస్థ జాతులచట్టం— క్రిమినల్ ట్రైబ్స్ యాక్ట్ — రద్దుకు ఆయన రెండు దశాబ్దాలు పోరాడి విజయం సాధించారు. లింగాల నేరస్థజాతుల సెటిల్ మెంట్‌లో ఏనాదిపడుచులను బానిసలుగా అమ్మడాన్ని పసిగట్టి రాఘవయ్య 1962 లో నెహ్రూకు ఫిర్యాదు చేసి, దర్యాప్తు సంఘాన్ని నియమించేట్లు చేశారు. ఆయన సేవను గ్రహించి 1972 లో భారత ప్రభుత్వం ఆయనను పద్మభూషణ బిరుదంతో సన్మానించింది. సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర హైకోర్టు మాజీప్రధానన్యాయమూర్తి శ్రీ గోపాల్‌రావు ఎక్‌బోటే, గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీ, హైకోర్టున్యాయమూర్తి శ్రీ ఎ. గంగాధరరావు, సన్మానసంఘాధ్యక్షుడు శ్రీ కె. గండయ్య ముస్నగు వారు రాఘవయ్య సేవను, చిత్తశుద్ధిని ప్రశంసించారు. గిరిజనులు మహానందంతో జీవితం గడుపుతుంటారని, వారి జీవితవిధానంలో మార్పుతెచ్చే ప్రయత్నంలో వారి సంప్రదాయాదుల పరిరక్షణలో జాగ్రతవహించాలని గవర్నర్ ఉద్బోధించారు.

## జాలీ ఫ్రెండ్స్ పోటీలు

జాలీఫ్రెండ్స్ కల్చరల్ అసోసియేషన్ మహిళా విభాగం అక్టోబర్ ద్వితీయ పక్షంలో జరిపినవ్యాస రచనా, వక్తృత్వ శాస్త్రీయ లలితసంగీత పోటీలలో స్థానిక మహిళా కళాశాలల విద్యార్థినులు పాల్గొన్నారు. అధ్యక్షత వహించిన ఆంధ్రబ్యాంకిపి.ఆర్.ఒ. శ్రీ భాస్కరరావు ప్రసంగిస్తూ, సహ విద్యా యువతీ యువకులలో సదవగాహనకు కారణమవుతుందన్నారు. ముఖ్య అతిథి అయినఆచార్యతిరుమల దానిని సమర్థించారు. సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి వాసా ప్రభావతిశాస్త్రి సహవిద్యవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలను చర్చించి, సంస్కారం ముఖ్యమన్నారు. శ్రీమతులు డి. రుక్మిణీదత్తు, సి.విజయలక్ష్మి సంస్థ కృషిని ప్రశంసించారు. కుమారి రాజేశ్వరి వందన సమర్పణ చేశారు.

## ఉపశ్రుతి :

ఏమండి. అధ్యక్షుడు ఇంకా రాలేదు, గంట ఆలస్యమా? మంత్రులు ఆలస్యంగా వస్తే ఫరవా లేదు గాని, అన్నారు ఒక సాహిత్య సభలో హో శ్రోత పక్కవారితో. తొందరపడకండి సార్, తీసుకు రావడానికి మనిషిని పంపాము. వస్తూనేవుంటారు. అన్నారు సభా నిర్వాహకులు. తీసుకొని రావడానికా మోసుకొని రావడానికా? అని అడిగారు మరొకరు ఆయనకు దురభ్యాసాలేవీ లేవండీ. తీసుకొనిరావడానికే పంపాము అన్నారు సభా నిర్వాహకులు.

— తిరుమల రామచంద్ర.



ఇటీవల ఏలూరులో ప్రముఖ రంగస్థల నటుడు, దర్శకుడు శ్రీ రాధాకృష్ణ [ఆర్. కె. ను ఏలూరు డివిజన్ వ్యవసాయ శాఖాధికారి శ్రీ ఎం. అప్పలనాయుడు సన్మానించినప్పటి దృశ్యం.



నవంబర్ మొదటివారంలో జోర్హాత్‌వద్ద జరిగిన ఘోర విమానప్రమాదంలో 'పురినాకి విడచిన' ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ గారిని దేశప్రజలేగాక ప్రపంచ ప్రజలు కూడా అభినందించి, ఆయనకు ఆయురారోగ్యాలు కలగాలని ఆకాంక్షించారు.

ఈ 'జోర్హాత్' విమానాశ్రయంలో రాత్రిపూట విమానాలు దిగే అవకాశాలు సదుపాయాలు లేవు — ఐనా ప్రధానమంత్రి విమానం అక్కడ రాత్రి 7 గంటల ప్రాంతంలో దిగేలా ఏర్పాటు చేశారు— దీని ఫలితంగా దేశానికి ఐదురుగు వైమానిక దళ ఉద్యోగులు నష్టమైనారు. ఆ అమరజీవులు ఐదుగురిలో — శ్రీ సుంకర తెలుగువాడు.

## అవీ...ఇవీ...అన్నీ

### విష్ణుమాయ

నవల : రచన శ్రీమతి బొప్పుగడ్డ లలితాదేవి 360 పేజీలు, వెల రు. 11లు. ప్రతులకు: వాహిని పబ్లిషింగ్‌హవుస్, మ్యూజియంరోడ్డు, విజయవాడ2

### స్నేహలత

స్నేహలతారెడ్డి సంస్మరణ సంఘంవారు శ్రీ సంజీవదేవ్ గౌరవ సంపాదకత్వంలో వెలువరించిన స్మారక సంచిక. ఇందులో స్వర్గీయ స్నేహలతారెడ్డి జీవితవిశేషాలు, పలు సందర్భాలలో తీసిన ఛాయాచిత్రాలు ప్రముఖులు వ్రాసిన రచనలనేకం ఉన్నాయి. 250 పేజీలు గల ఈ సంచిక వెల 15 రూపాయలు. ప్రతులకు : లోహియా విజ్ఞాన సమితి, లోహియాలోగిలి, అమరావతిరోడ్డు, గుంటూరు—522,002.

### కావ్య పంచమి

అయిదు హిందీ మహాకావ్యాల పరిచయం. రచన: శ్రీ గాదంశెట్టి శ్రీరాములు. 124 పేజీలు, వెల అయిదు రూపాయలు ప్రతులకు : శ్రీమతి జి. గోవిందలక్ష్మి, తూర్పుబ్రాహ్మణవీధి, డబ్ల్యు. 4/205, గూడూరు, నెల్లూరు జిల్లా.

### చిత్రమైన జీవితం

నవల. రచన : శ్రీ చిట్టిబాబు, 176 పేజీలు, వెల : రు. 7—50. ప్రతులకు : శ్రీ కవితా పబ్లికేషన్స్, విజయవాడ—2.

### శ్రీ శేషేంద్రస్వామి జీవితము

రచన : ''విశాఖ'' 182 పేజీలు, వెల : 5 రూపాయలు, ప్రతులకు : సాధన గ్రంథ మండలి, తెనాలి, గుంటూరు జిల్లా.

### సాధన

కవితా సంకలనం. స్పందన సాహితీ సమాఖ్య (రిజిస్టర్డ్) వారి పదిహేడవ ప్రచురణ 94. పేజీలు, వెల 2 రూపాయలు., ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య (రిజిస్టర్డ్), 23/182 ఇ, న్యూ మునిసిపల్ క్వార్టర్స్ మచిలీపట్టణం 521001.

### కిరణాలు

కవితా సంకలనం. 28 పేజీలు, వెల రూపాయిన్నర ప్రతులకు : నటరాజా కళా నికేతన్ శాఖ, పోస్టు : ఎల్లారెడ్డి పేట ,505 303, సిరిసిల్ల తాలూకా, కరీంనగర్ జిల్లా.

### లోచన

కవితా సంపుటి రచన : శ్రీమద్ది బోడ్డున పార్థసారధి 36 పేజీలు, వెల రెండు రూపాయలు. ప్రతులకు : ప్రజా సాహితి, 5—4—26 తహశీల్ ఆఫీసు దగ్గర, నిజామాబాద్.

Printed and Published by S. NageswaraRao at
the Andhra Patrika press, MallikarjunaRao Street,
Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

